




సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.

1929. 0-8-0.

DEDICATED TO

# The departed Secred Soul

—OF—

## Sri Sri Krishnadevarayalu varu.

Maharajah

—OF—

## Wanaparthi Samsthanam,

(NIZAMS).

# రెండే మాటలు.

పద్యములు అల్లనేర్చిన చాపలముచే అప్పుడప్పుడు వ్రాసిన అనిబద్ధకావ్యముల సంపుటమే యీ పువ్వులతోఁట. ఇందలి పద్యములు ముక్కాలుమువ్వీసము భారతి, ఆంధ్రభారతి, పుష్పమాల, సాహితి, సుజాత, మున్నగు పత్రికలలోఁ బ్రకటితపూర్వములే. పునః ప్రకటనము ప్రత్యేకముగాఁ గావించుకొనుట కాజ్ఞయిచ్చినందులకు తత్తత్పత్రికాధిపతులకుఁ గృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

ఏ తద్గ్రంథముద్రణమునకు సహాయపడిన శ్రీరాజా నాయని రంగారావు బహద్దరు (మునగాల) వారి పుత్రికామతల్లియగు సరళాదేవిమహారాణీ (వనపర్తిసంస్థానము) గారికి నాకృతజ్ఞతను వెల్లడించుచున్నాను.

ఈ పొత్తమునఁ బెక్కుతావులందు విశ్రమములు మనఃపూర్వకముగాఁ బాటింపఁబడలేదు. అవి ప్రమాదపతితములు గావని మనవి.

విధేయుఁడు

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి.

---

# పుష్పలతోట.

# పుష్పవాలతోట.

## ఆశ్రమ ప్రాంతములు.

సీ. చెక్కించి చక్కఁగా సిద్ధంబుగాఁ జేయఁ
గాఁ బడినట్లున్న కందరములు
ప్రతిదినంబును నీరు పట్టి లెస్సగఁ బెంపఁ
బడుచున్నగతిఁ బొల్చు పండ్లచెట్లు
ఇచ్చ వచ్చినరీతి ఋషిచరుల్ త్రిప్పి కొ
న్నట్లుగాఁ బ్రవహించునట్టి యేళ్ళు
కల్పించి యొక్కనికై యేర్పఱచినట్లు
పొదలుచుండెడు పుష్పఁబొదరుటిండ్లు

గీ. కలిగి యొకదానిపైని నొక్కటియమర్పఁ
గాఁ బడినరీతి గొమరారు గండశిలలు
శిల్పినైపుణిఁ జూప రచించినట్లు
ప్రమద మొనరించు నాశ్రమ ప్రాంతములివె!

సీ. భక్తియుక్తంబుగాఁ బాద్యంబు నర్పించు
నెల్లప్పుడీ సెలయేళ్ళ జాళ్ళు
హృదయపూర్వకముగా నిచ్చు నర్ఘ్యంబును
దినదినం బీపూవు దీవెగములు

ఆప్యాయనమ్ముగా నాహార మర్పించుఁ
జేతికి నీపండ్ల చెట్లగుంపు
ఆర్ద్రచిత్తంబుతో నడుగు సేమంబును
గలకలకూయు నీ పుల్గుఁగుంపిండు

గీ. అన్నిటికి నేమి గాని తానచట వెలసి
యుండు శాంతిదేవత మహితోత్సవమునఁ
జెల్గి యమృత వాక్యముల నాశీర్వదించు
నేగుదెంచెడు నతిథుల బృందములను.

చ. వలదనుమాట లేదెవరు వచ్చిన; నెన్నిదినంబులున్న నోఁ
బలికెడువారులే; రొకరివస్తువు లివ్వనుమాటలేదు; తీ
వెలగమితోడ స్నేహలతఁ బెంచుచు నుందురు బాపు! చెప్పఁగా
వలసినదేమి? మానవుని భాగ్యమె కాయట కేగి కాంచుటల్.

గీ. ఎపుడు సెలయేటి యొడ్డుల నెగుడు దిగుడు
రాతి బండలఁ గూర్చుండి రాత్రిపడెడు
దాఁక నానంద మధుర గీతములు పాడు
చంద్రు ఋషికుమారికలు మహోత్సవమున.

సీ. ఉన్నతికిం బోవుచున్న గొబ్బుండుల
చెట్టుల నరసి వీక్షించుచున్నఁ
బండుల బరువుచే నిండి నేలకు వంగు
కొమ్మలుగల వృక్షకోటిఁ గన్నఁ

బరులకోసంబె జీవనములు దాల్చుచు
నవయంబుఁ బాఱు వాహినులఁ గన్నఁ
గంటకాదులు తమ్ముఁ గాఁడిన నిశ్చల
త్వమును మానని శిలాతతులఁ గన్న

గీ. మానవుని చిత్తమందు నే మాత్రమైన
జ్ఞానముండిన యెడల నిశ్శంకముగను
సడలిపోదె? తనంత దోషప్రవృత్తి
పరులు బోధింప నక్కఱ పట్టకుండ.

సీ. తాపసేంద్రులకు నిత్యమును శుశ్రూషింపఁ
గ వసంతలక్ష్మి జాగ్రత్తనుండు
మునిపుత్త్రికలు గాత్రముల నెత్తి పాడఁబోఁ
గోయిలగమి శ్రుతి వేయుచుండు
బ్రహ్మచారుల వేదపాఠంబులోఁ గీర
బృందంబులు గవళ్ళు దిద్దుచుండు
సామగానమునకు శైలంబు హృదయంబు
గరగి నిర్ఝరములై పఱచుచుండు

గీ. అకృత్రకమనోహారంబులౌ నా కుటీర
కంబులానందరాజ్యశృంగాటకములు
ఋషిజనైక తపోధన క్రీతమైన
యా ప్రపంచంబు స్వర్గమర్త్యముల సంధి.

గీ. తీరుతీరైన చల్వపందిళ్లు వేసి
రీతి రీతిఁ బూఁదోరణల్ వ్రేలఁగట్టి
వలయు సర్వసన్నాహంబు సలుపఁబడెను
అచట నానందలక్ష్మీ కల్యాణమునకు

గీ. ఒక్కవృక్షంబునకుఁ బూచి యున్నపువ్వు
లొక్కచేనిలోపలఁ బండియున్న పంట
ఒక్కగనియందు జనియించియున్న మణులు
ఈ ప్రదేశానఁ జరియించు నెల్లమంది

శా. సాయాహ్నంబునఁ గొండవాఁగుదరినిన్ సాంధ్యక్రియల్
తీర్చినాఁ
డేయేసాధనలాచరించుకొనిరో ? యేక్రొత్తలంగాంచిరో ?
ఆయూహానివచించుకొంచుఁజనుచుంద్రంధమ్ముకాఁగామునుల్
మాయంబోలెను ముండ్లకొమ్మలను దన్మగ్గాననుత్తించుచున్

ఉ. మావిచిగుళ్లఁగాని సుకుమారలతాతతియందుఁగాని క్రొ
త్తావులు జల్లు పుష్పములతండములందునఁగాని తోఁచునా
చేవ మనోహరత్వమును శ్రీయుఁగనుంగొనరాదొకింతయున్
దేవళమందుఁ గన్పడెడు దేవునిమోమున నేమిచిత్రమో !

కం. యువతులు యువజనములు నుం
బున్పుఁ బొదలం జేరి పాఠములు చదువుచు రా
త్రి విశేషంబుగఁబోఁగాఁ
బవళింతు రశంకితముగఁ బార్శ్వములందున్.

---

# సెలయేఱు.

గీ. అలలచేతుల నిరుగెలంకులకు నొత్తఁ
బడిన రీతిగఁ దగుఁ జెట్లవరుస, లల్ల
వానితాఁకుల గగ్గులుపాటుగొన్న
పొలుపు వహియింపఁ జక్కఁగా మ్రొగ్గఁదొడిగి.

గీ. వాంశికనికుంజకము లేలపాటపాడ
శరవణము పిల్ల నవ్వుల సన్న సేయఁ
గానఁబడునట్లు తమ మోటకము తెలుంగు
దారి నరికట్టి పెనురాలు బారు దీర్ప.

గీ. మలయపవనాంకురములకు మనసుగదల
నడవిపువ్వుల వేణియందలవరించి
నురుగుగందంబు నెమ్మేను మెఱయనలఁది
యంచపూఁబోండ్లతో మాటలాడుకొనుచు.

గీ. ప్రక్క ప్రక్కల కొదుఁగుచు వారికెల్లఁ
దావకప్రేమరాజ్యంబు ధన్యజన్మఁ
దైన వేనికి గుత్తకీయంగఁదలఁచి
యేగెదో! తెల్పఁగదె! సెలయేటిబోటి!

గీ. నిన్ను నాదు కవిత్వమందిరమునందు
నిలిపి స్వాగత మర్పింతు; నేను గవినిఁ
బ్రకృతి సౌందర్య చిత్రకోపాసకుఁడను
సుకృతవశమున నిన్నుఁ జూచుటలభించె.

---

# చంద్రుఁడు.

గీ. అల్ల మిన్నేటి తీరంబునందుఁ జెలువు
గులుకు మొగిలుకొండల నున్న కోనలోనఁ
బొలుచుచున్నది యొక్క తపోవనంబు;
చెలఁగుఁ జందురుఁడను ఋషిశ్రేష్ఠుఁడందు.

క. పరిశుద్ధుఁడు, సర్వకళా
పరిపూర్ణుఁడు, సుందరుండు, ప్రాప్తవమోవి
స్ఫురితుండు, ప్రపంచతమో
వారణసమర్థుండు వెలుఁగునతఁడున్నతుఁడై.

గీ. కనులఁగప్పంగ నిండు జవ్వనపుఁబొగరు
పైఁబడఁగఁ బాఱు రోహిణీపంకజాస్యఁ
గరములం దోయి యాలకుఁ; గాని యాతఁ
డెట్టి ధృతిమంతుఁడో ! కౌఁగిలియఁబోఁడు.

గీ. అలరు సాయాహ్నములయందు నాశ్రమంబు
నారుబయలునఁ గూర్చుండి యద్భుతముగఁ
దారకా శిష్యులకుఁ దత్త్వదర్శనములఁ
బండువెన్నెలపేర నుపన్యసించు.

గీ. ఆయుపన్యాసమందలి యంశములకు
సంశయములెల్లఁదీఱఁగా సంతసించి
నిర్మలతుషారమిషమున నింగి నుండి
బాష్పములు గాల్చుచుండిరి వారుగనుల.

---

# అభిలాష.

గీ. పర్వతములందుఁ దిరుగాడ, వానిశిఖర
కోటి వసియింప, సెలయేళ్ళఁ గుప్పించులిడఁగఁ,
గనఁగ నాయావిశేషముల్ మనసుపుట్టె;
నారిదంబ! కొంపొమ్ము నీపైని నన్ను.

గీ. అలలపై నెక్కి తూఁగుటుయ్యాలలూఁగఁ,
గడలవెలఁదుల గీతరాగములు వినఁగఁ,
బాలతీవల శయనింప, బుద్ధిగలదు
మారుతంబ! కొంపొమ్ము! నమస్కరింతు

గీ. ఆకసమునందుఁబడి వలయములుతిరుగఁ,
బల్లటీల్వేసికొంచును బరువులెత్తఁ,
గొమ్మలందునఁ గూర్చుండి కూయ, బుద్ధి
గలదు కొనిపొందు ననుఁబతంగంబులార!

గీ. తారకాబృంద మండలోద్యానమందు
నీ మృగముతోడ నీతోడనిత్యమాడు
కొనుచు, గంగలోఁబడి యీఁదుకొనుచుఁ, దిరుగ
మనసుగానుండెఁ గొనిపొమ్ము నను మృగాంక!

గీ. శయితదయితుని ముద్దాడు ప్రియయువతినిఁ,
దన్నుఁదలచుచుఁ గూర్చుండి యున్న తన్వి
వెనుకగావచ్చి గిలిగించు ప్రియునిఁ,గాంచ
నాశగలదు గొంపొమ్ము! యనంగ! నన్ను.

---

# కోకిల.

౧

సీ. ఆ వసంతు నాస్థాన గాయకవతంస !
స్వాగతము నీకుఁ గోకిలా ! స్వాగతంబు
చాలకాలంబునుండి దర్శనము లేదు
క్రొత్త రీతులు నేర్వంగఁ గోర్కెపుట్టి
చనితివే యల్ల కిన్నరాంగనలకడకు ?
గానమునఁ గ్రొత్తలేమేనిఁ గఱచినావె ?
పాడు మొకపాటఁ జెవ్వుల పండువుగను.

౨

నిరుటి యీ దినముల వింటి నీదుపాట
గున్నమామిడిదగ్గఱఁ గూరుచుండి
మరల నటువంటి పాట భూమండలమున
వినమిఁ జెవ్వులు త్రుప్పు వట్టెను సఖుండ !
గున్నమామిడిఁ జూచుచునున్న యప్పు
డెల్ల నానాఁటి నీపాట స్మృతికివచ్చి
తియ్యతేఁపులు మిక్కిలి తేన్పుచుందు.

౩

కుంజతలమందు నొంటిగాఁ గూరుచుండి
మోహగీతంబులను బాడు ముగుదవోలెఁ

దనహృదయవల్లికకు దోహదములు నేసి
ప్రకృతితరుణి పూయింపఁ బుష్పవ్రజంబు
మధురకావ్యంబు వ్రాసి పల్మారుదానిఁ
దానె తనలోనఁ జదువు సత్కవియుఁబోలెఁ
బలుచని మొగిళ్లచేతఁ గప్పఁబడి రేక
పిండుఁ బైపైకిఁ బఱచు భానుండు వోలె
వనతటంబున విహరింపవచ్చు విరహి
బృందములఁ బట్టి పీడింప బెట్టిదముగ
నురుల దిక్కులఁ బన్నెడు మరుఁడువోలె
జీవితరహస్య మెఱిఁగిన జీవివోలె
దుఃఖములు తాఁకిచూడని దొరయుఁబోలెఁ
దఱుముచున్నట్టు లెవ్వరో? త్వరవహించి
పాట పయిఁబాట శరపరంపరగఁ దమిని
మఱచి విశ్వంబు, గీతంబు మఱచి, నిన్నె
మఱచి, పాడుచునుందువు మఱియుమరియు;
నెంతపాడిన నించుకే నెలుఁగురాయ
దెట్టి పుణ్యంబుఁ దొలిజేసి పుట్టినావొ?
అంతకంతకు మధురమై యడరుఁగాని;
పాడినదె పాడుచున్నను బ్రజలు విసుఁగ
కాదియందున వినినట్లె యాదరింత్రు
తనివిఁదీఱంగ నీపాట వినఁగ మరియుఁ

"గో" యనుచు నిన్నుఁ గవ్వించి కూయుచుండు
నిజముగా సదృష్టంబన్న నీదికాదె?

౪

భవ్యముగ మావిఁ గూర్చుండి పాడుచుండ
నీదు గీతామృతంబు ఘనీభవించు
నేమొ! లేకున్నఁ దద్రుచి యేల్లు గలుగు
మావిపండ్లకుఁ? దీవెలుంగ్రావు నేమొ!
లేనిచో నేలపువ్వులు దేనెలూరు?
వాతములు మున్గునో! కానిపక్షమందు
నంత చల్లఁగ వీచునే? హాయిగదుర

౫

నీదు మృదుళ రవంబెల్ల నిక్కువముగ
గానమా? నూత్న దంపతుల్ కలసిచదువు
చారు శృంగార కావ్యమా? సహజమధుర
వాక్యమా? యీసకలమునా? ప్రతివచింపు
మాకు రాదేల? నీకట్టు మధురరుతము
ఏమహాత్ముల సేవించి యీదృశమగు
హృదయ సమ్మోహ విద్య నార్జించినావు?

౬

వినఁగ వినఁగ భవద్గానమును నపూర్వ
భాషయందున్న ప్రకృతి కావ్యంబునందుఁ
గ్రాలు రసఘుట్టములను బారాయణంబు
సేయుచున్నట్లు నాకుఁ దోఁచెదవు పికమ!

నీవు లేకున్న ఋతువులు నిశ్చయముగఁ
బ్రియుఁడు పరదేశముననున్న ప్రియలుసుమ్ము!
నీవు లేకున్న దేశంబు నిశ్చయముగ
వాక్కుపడిపోయిన సమగ్ర పండితుండు.

---

# భారతీ!

శా. కేలందాలిచి వల్లకిన్, శ్రుతినిఁగా గీలించి యుత్సాహ ము
ద్వేలంబై రసవాహినుల్ పఱవఁగా దీపించుగాంధర్వ వి
ద్యాలాభంబుగడించికూడ నిపుడేతద్భావ గీతచ్ఛలం
బాలాపింతువ దేటికమ్మ! విరసంబౌ గానమో భారతీ!

గీ. వేద ఋషులకుఁ గాళిదాసాదిదివ్య
కవులకున్నతిఁ గూర్చు నీగానతటిని
అకట! దుష్కాలపు టెడారులందుఁజిక్కి
దేవి! యడఁగెను మాదురదృష్టకలన.

మ. తొలుతం బాడుచునున్న వీఁశియనొగిన్ దూరంబుగాఁ
దోసితో?
అలనీగాన రహస్యముం దెలియు సభ్యశ్రేణి లేరంచుఁ దం
తులనన్నింటినిమార్చి వైచితివొ? యీనూత్నప్రజాశ్రేణికొ
చ్చెల! యీగానముగాని నచ్చదనుచుం జేకొంటె? యీ
కిన్నెరన్.

---

# కవి—అభినవస్వర్గము.

గీ. విశ్వమున లేనిభాషలో విస్తరించి
చేతనాచేతనంబులు చెప్పకొనెడు
స్వస్వజీవితకథలు పరిశాంతముగను
విని వచింతువు మాకుఁ గవీ! నమస్సు.

గీ. దివ్యదృష్టివహించితో? దేవతావ
రంబుఁగంటివో? పరులనేత్రింబులకును
గోచరింపని క్రొత్తలు గోచరించు
గోచరింపని మాధురి గోచరించు.

సీ. సృజియింపఁజదుర వీక్షితిమండలమునందుఁ
బ్రకృతికాంత యసూయపడ సపత్నిఁ
గట్టఁగాఁజాలు దాకాశగంగఁ జరింప
మేలిమిబంగారు పూలతెప్పఁ
జదువఁగాఁగలుగుదు జంతుసంతతి చిత్త
మందలి భావరహస్యలిపినిఁ
జూపింపఁగలవు నీ సూక్ష్మదర్శినిచేత
దిక్కుల కావలిదేశములను

గీ. గడిమిఁ జేయంగలవు నేల విడిచి సాము
నెగుడుదువు తెక్కలునులేక గగనవీధి

భూమిలోపలి కీఁదుచుఁ బోవఁగలవు
ఎచటనేర్చితీ విద్య? యోయీ కవీంద్ర!

చ. నడచుచునున్నఁ గ్రింద, గగనంబునఁ బువ్వుల తేరిమీఁద నె
ల్లెడ విహరించుచున్న యటులేయగపట్టెద ; వెల్లమందితో
నుడుగక కూడి పూసికొనియుం దిరుగాడుచునున్న నెప్పుడుం
మడుఁగును గట్టుకొన్నటు లెమాకుఁ గనంబడుదయ్యా! సత్కవీ.

చ. అనృతముగాదు నీపలుకునట్టి దొకింతయు సూనృతంబుఁగా
దును; మరినీయొనర్చునది దుష్కృతముం సుకృతంబుగానిగా
దును; దగనీవు దెల్పునది దోష్టము నీతియు నీతి యేనిఁ గా
దును; నీకుఁ బుణ్యపాపములు తోఁకి కవునీగడపంగవీశ్వరా!

గీ. సర్వసాధారణంబుగా సంభవించు
బుణ్యపాపలోకాలకుఁ బోవునీవు
సత్కవులకై సృజింపించె స్వర్గమొండు
బ్రహ్మరాణి యాశ్రిత పక్షపాతముననుం.

సీ. వేయితంత్రులు గల వీణియమీటుచుఁ
బాటపాడుచునుండుఁ బ్రకృతిలక్ష్మి.
పదివేల ఱేకుల బంగారు తమ్ములు
గలిగి శోభిల్లు శృంగారతటిని
లక్షసంఖ్యాక కళాశ్రేణిఁ గురియుచా
నందంబు సంధించుఁ జందురుండు

పదిలక్షజాతుల ఫలపుష్పదళములం
దనరారుచుండును దరుచయంబు

గీ. తోఁటమాలీలుగా మన్మథుండురతియుఁ
బొలుచు 'శృంగారవన' మనుపూలతోఁట
యెల్లవస్తువు లచ్చట సృష్టికర్త
వ్రాయువరవడి తలకట్టు వ్రాలుసుమ్ము.

సీ. నవరత్న తరువుల నయనోత్సవంబైన
మవ్వంపుఁ బువ్వుల మరగికొని
బాగైన యింద్రచాపపుఁ ద్రాఁగు టుయ్యాల
లందుఁ ద్రిప్పున వలయముగ న్వ్రాఁగి
మెఱుగారు తొలుకారు మెఱుఁగుల పొదరిండ్ల
మొత్తంబులకు నొక్క మొగినిమ్రాఁగి
పరిమళవాహినీ నాస్తరంగములందుఁ
గేరింత గొట్టుచుఁ గ్రీడసలిపి

గీ. యచటఁ దమకై నిరీక్షించు నట్టి దివ్య
కన్యకారత్నములతోడఁ గవులుగూడి
యనుభవించుచు నత్యంత మైనసౌఖ్య
మపునరావృత్తి నాస్వర్గ మందునుందురు.

మ. చెలువంపుంగనిమై విరాజిలెడు నాశృంగారపుందోఁటలోఁ
గులుకుంబ్రాయపుబోంట్లతోఁగలిసిచెక్కుంజెక్కునున్ గాయఁగం
కలతంగేలఁ జెనంచి రమ్యముగ నానానర్మసల్లాపముల్
వలపుంజిమ్మఁగ ముద్దులంగొనుచునున్ వర్తిల్లదో సత్కవీ!

గీ. కోటిమణుఁగుల పుణ్యంబుఁ గూడఁబెట్టు
ధార్మికుండేని నెల్ల విద్యలను నూఱి
త్రాగిన బుధుండునేని సత్యము వచింతు
సత్కవీ! నిన్నుఁ బోలంగఁ జాలఁ డెపుడు.

కం. తినఁగా నన్నముఁ; గట్టం
గను బట్టయునుం బరుండఁగా మంచంబుం
గనకున్నను లేఁడుసుమీ !
నినువంటి యదృష్టశాలి నిజమునకుఁ గవీ !

---

# మందమారుతము—
# ఝంఝామారుతము.

౧

గీ. తన సహస్రామృతకరాబ్జతతినిఁ జాఁచి
ప్రకృతిమాత స్వకీయపుత్త్రికులఁబ్రీతి
యొలుకఁగౌఁగిటికిం జేర్చుచున్నదేమొ?
స్వర్గమునుబొంది నందనవనమునందు
నమరయువతుల కేళీవిహారములకు
మరగి తత్కథల్ వర్ణించు సరసకవుల
యమలరసవత్ప్రబంధ పద్యంబులేమొ?
వలపుఁగొనియున్న నూత్నదంపతుల భావ
బంధురమగు రహస్యంపు భాషలేమొ!
దట్టముగమింట వ్యాపించి మొట్టమొదట
ఖండఖండంబులై క్రమక్రమముగాను
గరఁగి కనఁగి యణుత్వంబుఁగని యగోచ
రంబులయిపోయిన వలాహకంబులేమొ!
పటుతిరస్కారిణీ పరిభావమున డాఁగి
పైఁటచెఱఁగులఁ దాఁకు స్వర్వనితలేమొ?
కానిచోనింత హాయియుంగాని యింత
కమ్మఁదనమింత మెత్తఁదనమ్ము, నింత

చల్లఁదన, మింత మోహాతిశయముగాని
మానవులకిచ్చునే? మందమారుతములు
ఎవఁడు కల్పించె వీనికి నిట్టి మహిమ !

౨

ఓయిమంచానిలంబ ! నిన్నొక్కమాట
యడుగఁదలఁచితి; నీవు బ్రహ్మాండమెల్లఁ
దఱచుతాల్చి సహస్రావతారములను
దిఱుగుచుందువు గద ప్రతిదినముఁబనిగఁ
గలదు పదునాల్గుభువనముల్ కాక కవి శి
ఖామణులకుఁ బ్రత్యేకలోకమని విందు
నచటి శృంగారవనముల కరిగి నావె ?
చెప్పుమా ! నాకుఁ దత్త్వివశేషములను
బ్రథిత చారిత్ర గంధ సంవాసితమయి
పుడమిదుష్కాల భూకంపములనడంగి
పాడువడిన పురాతన పట్టణములు
గంటివే? తెల్పు నాకుఁ దత్కథలనెల్ల
నర్థమెఱుఁగనీ పరభాషలందుఁజెలఁగు
మంచి కబ్బంపుఁ దోఁటల మసలినావె?
చెప్పుమా! నాకుఁదత్త ద్విశేషములను
నీపరిమళమంతయు నిశ్చయముగ
వాని సంబంధియనుచు భావన మొనర్తు

మరియు నిన్ను గహస్యంపుమాటయొక్క_
టడిగెదను గాదు నాక సత్యమువచింపు
మానినీరత్నములను సమర్పణంబు
సేసిప్రియులకుఁ గొన్న విశేషపుణ్య
పరిమళముగాదె? యీనీదు పరిమళంబు.

3

ఓమరుద్దేవ! విశ్వమహోత్సవంబు
నెఱపుదువు సౌమ్యమూర్తివై నింగిమెఱసి
యట్టి తఱులందు లేఁడు నీ యట్టిఁడనుచుఁ
బ్రజలునుతియింత్రునిను జగత్ప్రాణమ వని
కాని యున్నట్టులుండి యకారణముగ
మిక్కిలి భయంకరంబుగా మేను పెంచి
తరులఁ బెఱకుచు సౌధముల్ విఱుఁగదన్ను
చిండ్లకప్పులు లేపుచు నెల్లకొండ
లూచముట్టఁగఁ గదల నుఱ్ఱూఁతలూఁపి
వేయుదువ; యంతకంతకుఁ బెరుగనోడలు
పీనుఁగుం బెంటజేయుచు విశ్వమెల్ల
మ్రింగ వేమొగంబుల హుంకరించుకొనుచు
వచ్చుచున్నచందంబునఁ గన్పడెదవు తృటిని
మరియొకప్పుడు వహ్నితో మైత్రిసేసి
చేతమందు లేశముఁ బాపభీతిలేక

లోకసంహారమునకుఁ జాలుదువు మిగుల
బాల్యదశయందు నినుఁగన్న వారలెవరు
నిట్లగుదువంచుఁ గలనైన నెంచియుండ
రీవు కంటికిఁ గాన్పింప నిట్టివేళ
జనులు కడకండలుగ నిన్నుఁ జలుపకుందె?

౪

ఒడ లెఱుంగని సివమెత్తి పుడమిఁ బాడు
పఱచి తుదకుఁ బశ్చాత్తాపపడుచునున్న
కరణి నుఱుముల యెలుఁగెత్తి తెరతెరలుగ
వాన కన్నీరు వరదలై పాఱుచుండ
నెవ్వరికి నాపఁగా రాక యేడ్తు; కాని
యేమిలాభంబు గలుగు నీ యేడ్పుచేత
నష్టముంగొన్న బీద జనంబులకును?

౫

అట్టి సుప్రసన్నాకృతి నట్టిమృదుళ
సరళ సుస్వభావుఁడ నట్టి శాంతమతివి
కాంచుచుండంగనే యిట్లు కాలమృత్యు
వునకు నపరావతారంబవో! యనంగ
నుగ్రమూర్తివై చరియించుచుందువేల?

---

# ఆంధ్రుఁడా!

గీ. ఆంధ్రుడను నేను ; నా భాష యాంధ్రభాష ;
ఆంధ్రదేశంబు నాది ; యటంచు, నీవు
మురిసిపోవోయి యాంధ్రుఁడా ! మురియ కేమి ?
సర్వమధురంబు గద నీదు చందమెల్ల.

సీ. కలముచేఁ గత్తిచేఁ గలఁచి దిగ్విజయంబు
రచియించు శ్రీకృష్ణరాయపతికి
తెలుఁగునకమృతంబుఁ జిలికి జీవముపోసి
తేర్చు కవిబ్రహ్మ తిక్కకవికి
అన్యదేశ్యుల కవశ్యాధ్యేయమగు గీత
రచన సేసిన త్యాగరాజకృతికి
అనినుండి పాఱివచ్చిన భర్తనెగ్గాడి
యీసడించిన మానరాశి యువతి

గీ. కిట్టి పుణ్యాత్ములను గాంచినట్టి దేవి
కాంధ్రమాతకుఁ దీర్తు వేలా ? ఋణంబుఁ
బ్రతిదినంబును సుకవితారసముతోడఁ
దర్పణము సేసి సలుపు వందనములాంధ్ర !

ఉ. తేఁకువ నీదు పూర్వుల మదింగొని సాంఘిక రాజకీయ భా
షాకళలందువారల విజాత్యమహోన్నతినిం దలంచుచున్

నీకుఁగలట్టి పెన్ప్రతిభ నీదునిగూఢపుఁశక్తిఁ జూపి ప్ర
త్యేకతనిల్పుమోయి! పరదేశ్యులు నిన్ననుదాహరింపఁగన్.

శా. శూరుల్ పందలుఁగారు; కార్యములదక్షుల్, కారువా
క్ఛూరులున్;
సారోదారులు, గారుదుర్బలులు; నస్వార్థుల్ స్వలాభాతురుల్
గా, రీయాంధ్రులటన్న తొల్లిటి శుభఖ్యాతిన్ మహాదేవి న
ట్లారాధింపఁగదోయి! నీదుప్రతికార్యారంభమందాంధ్రుఁడా!

గీ. ఆంధ్రులన నాంధ్రభాషనా నాంధ్రదేశ
మనిన నుప్పొంగవలదె! నీయంగకములు
అన్యులాంధ్రులు గాఁకి నాత్మలందు
వగచుకొనునట్లు చేయఁగవలదె? యాంధ్ర!

---

# భావకవి.

కం. తలకొక్క కవిత యెవ్వని
పలుకులు వానికె రుచించుఁ బరులవి చెవికిన్
ములుకులుగఁ దోఁచు నమృతపు
గుళికలుగానున్న నెట్టి ఘోరమొ! కనుఁడీ!

గీ. తనదుపలుకులు క్రొత్తకుందనపుఁ దునుక
లితరులవి గాజుముక్కల; యెల్లతనదు
పద్యములు ద్రాక్షగుత్తులు; పరులవెల్ల
మునఁగిపండులుగాఁ దలపోయుచుండు

గీ. తనదు భావంబు నెఱుఁగలేరనుచు వగచుఁ;
దనదు చదువని ష్ప్రయోజనము లనును;
దనదు శూన్యతఁ బరిపూర్ణతనుగ నెంచుఁ;
దనదు నజ్ఞత రసికత యనుచుఁ దలఁచు;

కం. తనదగు కవనరసాయన
మునకై దేశంబు దప్పిఁబొందిన దేమో!
పనిపాటులు లేనట్టులు
ననునిమిషము గిలుకుచుండు నమ్యోకయితల్

గీ. తానొకండె భాషాలతోద్యానమందుఁ
దోఁటమాలిగ భావించు; దోహదముల

నూతనములైన ఫలపుష్ప జాతిగణముఁ
బెద్ద సృజియింతునని విఱ్ఱవీఁగుచుండు

గీ. మెఱుఁగుఁబూఁతలు పెట్టి చూపఱకుఁ గనక
మనుచు నిత్తడిఁ జూపి వంచనముఁ జేయు
బుధులు నిలఁబెట్టి యడుగఁగా బూకరించి
మీకుఁ దెలియద యని మిఱ్ఱిమిఱ్ఱిచూచు

గీ. హృదయమున నచ్చు గుద్దిన ట్లెదుట నిలిచి
తాండవించు చున్నట్లు చిత్రఫలకంబు
భావమును బ్రదర్శింపఁగా భావరాక
యదుకు వెట్టుచునుండు నాయాయిగతుల.

గీ. తలయుఁ దోఁకయు లేని మిథ్యామనోహ
రార్థములు పడికట్టు రాళ్ళవకతవక
భావములు గూర్చి కబ్బముల్ వ్రాయుచుండ
నేందు కీతండు వ్రాసె నిస్సీ ! యనంగ.

గీ. వీనికవిత నాస్వాదింపఁగానె కొంత
మంది జన్మించినారు భూమండలమున
వారికోసంబె యాతండు ప్రభవమొందె
నాయదృష్టంబు వర్ణింప నలవిగాదు.

గీ. ప్రీతపుంతనె ప్రీకాడవలయు ననను
గొ్త్రిరీతులఁ జెప్పింపఁగూడ దనను
శక్తి నార్జించి వ్రాయఁగాఁ జాలినట్టి
వారి కర్పింతు నెద నమస్కారశతము.

---

# "సినీమా" ప్రదర్శనము.

గీ. నాఁడు పున్నమరేయి; మా మేడమీఁదఁ
బండు వెన్నెల బయలఁ గూర్చుండ నన్ను
నా విశాలాంబరమునకు నక్షియుగము
పిలుచుకొని సినీమా వింతఁ జూపింతు ననుచు.

గీ. చందురుని తేటవెన్నెలజాలుతరఁగ
గముల కెదుఁరీదుకొనుచు మీనములవోలె
మంచుబొట్టులవిరివాన ముంచఁ దడిసి
చనఁగ నచ్చట నొకప్రదర్శనము జరిగె.

గీ. అల్ల వినువాఁకదరుల బయళ్ళయందు
పైరుపచ్చలు మేయుచు బలసి పొదుఁగు
వ్రేగుపఱపంగ మెలమెల్ల నేగుచుండు
నాల గుమివలెఁ, దారతమ్యంబు విడిచి
పైపయిం బేర్పఁబడు రాతిబండలు గల
చిన్నగుట్టలు వలె; నాల్గు చెఱఁగులందు
నేకగతి రంగు కలియని కోకలువలె;
నాకసపు సంద్రమందుఁ బ్రయాణమైన
చంద్రనౌక కెత్తిన తెరచాపలువలెఁ;
జుక్కలవెలంది ముత్తెంబు సొగసుదోఁప

మొగము దమ్ములఁ గొను మేలిముసుఁగులవలె;
సత్కవులు కీర్తి సతులతో సంచరించు
పువ్వుల విమానములవలెఁ, బుణ్యలబ్ధ
కామరూపంబుఁ గొని మజ్జగములఁ దిరుగు
సిద్ధపురుషులవలెఁ, బరిశుద్ధమైన
తాపసుల చిత్తములు దాల్చు రూపులువలె;
దిగ్వధూటులు బహులునం దివిరి యాఱ
నైచు కద్దరు చీరలు వలెను; గళలఁ
గురియు శశిబాలకుని పొత్తిగుడ్డలువలెఁ
పొలుచు మిన్నేటి సైకత భూములువలె;
మెఱయు (1) నభ్రిక పత్త్రింపుఁ బొరలువలెను;
బ్రకృతిసతి మందహాస తరంగలువలె:
మరియుఁ బెక్కు తెఱంగుల మంచిమంచి
జలద * చిత్రింబులను నభోజవనికపయి
మంత్రిగాని విధంబున మార్చిమార్చి
చూపుచుండంగ నెవ్వఁడో. చూచినాఁడ.

గీ. తత్ప్రదర్శన దృశ్యకథానకంబుఁ
దానిరమణీయమగు సంవిధానకంబుఁ
బ్రస్ఫుటాక్షరముల వ్రాయఁబడమి నెందుఁ
దెలియ లేకుంటిఁ గాని పొందితి ముదంబు.

---

(1) అభ్రమే అభ్రకము=ఆకాశము. ఆకాశమను అభ్రకపు రేకు.

* Films.

## జన్మభూమి.

గీ. కనులు గానక తనబిడ్డలను గ్రసించు
నాఁడు బెబ్బులిపురుటాలి కాత్మదేహ
మొసఁగినట్టి యాస్వార్థశూన్యుఁడు దయాబ్ధి
బుద్ధుఁ డుదయించె నీ స్వర్ణభూమియందు.

గీ. తారకాచంద్రసూర్యులు తమతపోవి
శాలతేజస్సు చాలమిం జాలఁగుంద
దేవదేవుని దర్శించి దేహమర్త్య
ముగనిడిన ఋషు లీపుణ్యభూమివారు

గీ. చక్కనగు మంత్రశక్తి హస్తమునఁ బూని
పోలెఁ బాషాణముల దారువులను బ్రాణ
ములనుఁబోసి యాడించు నపూర్వశిల్పి
ముఖ్యులు జనించి రీస్వర్గభూమియందు

గీ. ఏణెఁ జేఁబూని మఱచియీ విశ్వమెల్ల
భక్తిమెయిఁ బాడి ప్రాంతపర్వతముహ్లాదము
మది కఱఁగి యేఱులై పాఱునట్లు సేసి
పొలుచు గాయకు లీదివ్యభూమివారు.

గీ. పాణి ధర్మపతాక నాఁ బట్టి శాత
ఖడ్గ మాహవక్షోణి కఖండభక్తిఁ
దమ్ము బలినిచ్చుకొన్న నిస్తంద్రశౌర్య
ధాములు పుట్టి రీక్షాత్రభూమియందు

గీ. విశ్వజాతికి నొకబడిం బెట్టి వారి
కొక్క టేపాఠముం జెప్పి యుచ్చకంఠ
మునను బాడించిన యఖండపూజ్యశేము
షీమహామనంతు లీజ్ఞానభూమివారు.

గీ. అల్పప్రజారాధనమున కర్థాంగిఁ బరమ
సాధ్వి నిండుచూలాలి నిశ్శంకముగను
నడవిపాల్సేసి దుఃఖింపనైన వెఱచు
భూధవుఁడు రాముఁ డీయార్యభూమివాఁడు.

గీ. ఆమహాత్ముల పూతతేజోబ్ధియందు
గెరటములము గాకున్న శీకరములమని
యైన గర్వింపవచ్చు; సింహావలోక
నంబుఁ గావించి చూచికొనంగరాదె?

గీ. ఖండఖండాంతరముల నఖండమైన
యీదృశైశ్వర్యవిస్ఫూర్తి యెందులేదు

కన్నుఁగొట్టుచునున్నది ; కాని శ్వేత
జాతి కిది హరింపఁగనైన శక్తిలేదు.

గీ. పెక్కుజన్మలనుండియుఁ బేరుకొన్న
పాపములు, గడ్డకట్టిన తాపములును,
విచ్చిపోవుఁ; జేమెత్తి యావేశమునను
మ్రొక్కుఁడీ! జన్మభూమి కోపుణ్యులార!

---

# ప్రకృతిదృశ్యము.

గీ. చుట్టుగోటల బంధించి కట్టుకొన్న
పైఁడిమేడల. రతనాలమూఁడుగులను,
నంతిపురములయందు నహర్నిశంబుఁ
గాపురముఁ జేయుచున్న భూకాంతులార !
ఆసనంబుల కంటుకొన్నట్లు కూరు
చుండి రొక్కంబు లెక్కించు చూపిరాడ
కర్ధరాత్రంబు దాఁక నన్యంబు గనమి
వెండి బంగారములు తప్ప విశ్వమందు
వేఱులేదని తలఁచు కుబేరులార !
దీపములు పెట్టి రేలునుం దీఱకుండ
లేకరులచేత వ్రాయించు చేకరీతిఁ
గసరికొట్టుచు సంతృప్తిఁగనక పనికి
ఊఁచిఊంపానఁ బట్టుచుఁ బ్రతినిమిషముఁ
దాఁమె దేవతలుగను జిత్తమునఁ దలఁచి
ప్రభుతఁ బ్రకటించు నధికారివర్యులార !
సర్వకాలంబు మీ సౌధజాలమందె
కడపుచున్నార; లన్యలోకంబు గలద;
టంచుఁ గూడ నెఱింగినయట్లు లేను.
ప్రకృతిదృశ్యంబులను జూడవచ్చు మీకు

రండు ! మాగ్రామవాటికుటీరములవైపుఁ
గనుఁడి ! యొకసారి మీదుచూడ్కిని నిగుడ్చి
కొండ చిలువలు పగిదిఁ గుటిలగతిని
శైలములఁబాఱు సెలయేళ్ళజాలు లవిగో !
వృక్షములనీడ నెమరులు వేసికొనుచు
హాయిగాఁ బండుకొనియున్న యావులవిగో !
పరులు దెలియఁజాలని క్రొత్తభాషలోన
ముచ్చటలు చెప్పుకొనుచున్న పులుఁగులవిగో !
రండు ! మఱికొంత దూర మ్మాప్రక్కఁ గనుఁడు.
తడపలును దారములును నల్గడలఁ దిరిగి
తెచ్చుకొని గూండ్లనల్లుకొను పిచ్చుకలివిగో !
గాలి కెదురుగఁ బడగెత్తి కమ్మనైన
వాయువులు మ్రింగుచున్నట్టి పాము లవిగో !
ముండ్లచెట్లకు నెగఁబ్రాఁకి ముందుగాళ్ళ
నాఁకు జొంపంబులను మేయు మేఁక లవిగో !
చూపు మరలించి యిఁక నీవైపుఁ గనుఁడు
పువ్వు నిగ్గుల కలకల నవ్వు మొగము
లూన చిగురాకుఁ జేతుల నొండొరువుల
దగ్గఱకుఁ బిల్చుకొనుచున్న తరువు లవిగో !
పాలుఁద్రావెడు దాఁకనుం గాలునిలక
చంగు చంగున దాటు చాశాముఖములఁ

దోఁకలెత్తుక పఱచు నాదూడలవిగో!
పైరుమేయుచుఁ బచ్చికపట్ల బంతి
వోలె నెదురైన వెలుఁగులం బాదకుటిఁడ్ల
నెగిరి దూఁకుచునున్నవి మృగము లవిగో!

తలనుఁ బైకెత్తి యిఁక వియత్తలముఁ గనుఁడు.
పల్లటీల్వేయుచును మేఘపంక్తి దాఁటి
పోవుచున్నవి యేలోకమునకొ; యింక
మరల మనకగపడవు పావురము లవిగో!
రెక్కలను జాఁచుకొని యంతరిక్షసీమఁ
గనఁగ వలయాకృతిఁ జరించు గ్రద్దలవిగో!
ముక్కుతోఁ బట్టి సన్ననిపుడక యొకటిఁ
యాకసమునందు బరువెత్తు కాకి యదిగో!
యిదిగో! యీవైపు దృష్టి సారించి కనుఁడు.
ఇచ్చటచ్చటఁ దిరుగాడి యెరను దెచ్చి
యాత్రమునఁ గిచకిచలాడు చహామహామిక
డాసి నోటినిఁ దెఱచు బిడ్డలకు నోటఁ
జొనిపి తమనోటి యెరనిచ్చు శుకములవిగో!
కాయలను గొట్టివేయుచు గంతులిడుచు
నుల్లసముగఁ జెట్లఁ జరించు నుడుతలవిగో!
ఏపుగా గడ్డిపట్టిన మెడలు నవిగో!
మిటమిటని మిట్టిపడుచుండె మిడుతలవిగో!

రండు మరికొంతదవ్వుఁ గాంచుఁడు మరియు
బీటఁ బశువులు మేపుచుఁ గూటిబిల్ల
లాడుచున్న కాపరిపిల్లలరుగో ! కనుఁడు
దూరగత్తు లొండొరులు జెనవాఁడ్రఁ గూర్చి
వీఁగిల్చుకొనిపోవ గొంతుక వేసినట్టి
కేకలే వేయుచున్నారు కెరలియరుగో !
క్రొత్తగాఁ గట్టినార లాకోడెదూడ
లాగుచున్నది బండిఁ బల్లమున కదిగో!
యమునివలె దున్నపై నెక్కి యరుగుచుండె
గొడ్లకాపరివాఁడఁడుగో ! యొకండు
ఇదిగో! యీవైపు దృష్టి పాలించి కనుఁడు
కుఱువపయిఁ బండుకొనుపిల్లకోఁతి పేల
నేరితినుచుండెఁ గొమ్మపై నదిగో ! కోఁతి ;
దోసెలను గాల్చుచు నొకర్తె తోఁగివపక్క
నమ్ముచున్నది పిల్లల కదిగో ! యవ్వ
కూరగాయల కావళ్ళ చారు పట్ట
ణమున నమ్మంగ వెళ్లుచున్నారు లరుగో !
చెఱువుగట్టున బైరాగి చెట్లనీడ
వేషమును దిద్దుచున్నాఁడు వీఁకనఁడుగో !
ఇంక నెన్నెన్నిఁ గనుఁదోయి కింపుసింపు
దృశ్యములు గానఁబడుచుండు నిచట మీకు
విలువఁ గట్టుఁడు మీసౌధములకు మాదు
గుడిసెలకుఁ బక్షపాతంబుఁ గొనక మీరె.

---

# స్వప్నదృశ్యము.

గీ. కన్నులందేదో! ప్రాకాడుచున్న భాతిఁ;
జూడ్కిమావులపరు వెత్తువేడ్కఁ బాపి
వెనుక కెవ్వండో? పగ్గాల బిగుచుపోల్కి
వెనుకఁ బొంచుండి యెవ్వఁడో! గనఁగరాక
మోహజాలంబు విసరి నాబోధయుక్త
మానసము లాగుచుంటిన మ్మాద్రి; నాదు
నయనగోళంబులను మూసి నానమస్త
మింద్రియార్థంబు లెవఁడో! హరించు చున్న
త్రోవఁ;దోపించి క్రమముగా దూటి నిద్ర
హృత్కవాటంబు బంధించె; నేనొకండఁ
గాని యన్యుండు లేఁడ యొక్కరుఁడు నేని
నేగితిని శాంతముగను మధ్యేగృహంబు

గీ. శాంతిపాలిత మానందకాంతిదీప్త
మైన యాధామ మందు నేనాడుకొంటి
నో? యపుడు పాడుకొంటినో! యోలలాడు
కొంటినో? విభజించి వాక్రువ్వఁజాల

గీ. కొంతసేపటి కొక దివ్యకాంత లలిత
మూర్తి చనుదెంచి కై దండఁబూనె; మేను

పుష్పరథమునఁ గూర్చుండి పోవుచుంటి
మాకసంబున నానంద మతిశయింప.

గీ. తారకలు రమ్యవేషముల్ తాల్చి యొకట
జలదయవనిక లెత్తంగ సరసగతుల
నాటపాటల మెప్పొంద నాటకంబు
నభినయించెను శాంతిరసాత్మకంబు.

సీ. చదలేటి దరులఁ బచ్చని పట్టులఁ దన
మృగముతోఁ గ్రీడించు నిందుమూర్తి
మెఱుఁగుపిండుకు నాట్యపరికరంబుగ గాన
మును నేర్పు కిన్నరీజనచయంబు
గిరిశృంగముల నిల్చి ధరియించి తనువుల
బ్రకృతి వక్కాణించు రవికరములు
తమతమతారతమ్యమునకై యన్యోన్య
మాలంబొనర్చు సమస్తకళలు

గీ. పువ్వులవిమానముల నెక్కి వ్యోమవీథిఁ
గెరలి విహరించు సుకవులకీర్తిసతులు
మనసునకు వేడ్కఁబుట్టింపఁ గనుచుఁ గనుచుఁ
జనితి మాస్వర్గమునకు ముచ్చటలు గొనుచు.

గీ. మలయమారుతముల గూఢమంత్రశక్తి
చలివెలుఁగువెల్గులందలి చలువపసను

నాపికాలాపముల రహస్యార్థభంగి
నొకట వివరించుచుండిరి యువతులచట.

గీ. అంత నాకాంత పులకించి యన్వహంబు
రథముపై నన్నుఁ గొని యిట్టిరంగములను
నాకుఁ జూపింపఁగదవోయి ! నాథ ! యనుచు
గాటముగ నొక్కి మోవి నక్కాఁగిలించె.

... ... ...

గీ. స్వర్గముననుండి పుడమిపైఁ బడితిఁ; బుడమి
నుండి పాతాళమును జొచ్చియుంటి; నచటి
నుండి యత్యధోలోకంబు నొందినాఁడ
నొక్కఁ బ్రేల్మిడి నాయభాగ్యోచ్చయమున.

---

# పశ్చాత్తాపము.

౧

ఉదికి పరిశుభ్రముగ నార్చియున్న నాదు
జీవితచరిత్ర మనుతెల్లదోవతిపయిఁ
గనఁబడియుఁ గానఁబడకున్న గతిని మాసి
తొంటి చెడుగులమఱకలు తోఁపఁ, గాంచి
ప్రస్తుత పరిస్థితులఁబట్టి పాత్రికకథలు
నమ్మకయు నమ్ముచును హృదయమ్మునందు
నవ్వులాట నెపంబున నాదునెదుట
నెత్తిపొడుచు నామిత్రుల చిత్తవృత్తి
తెలియఁ జూచాయగా, నాకుఁ గలుగుచుండె
నాకుఁ బైఁ నేవగింతయు నోకిలింత.

౨

క్షోణి నాబుద్ధి సద్గుణశ్రేణిపుష్ప
ములను గన్నులపండువై వెలయుచున్న
సరసమగు నాదు పూజ్యతాపరిమళమున
నలుఁగడల్ గదు గమగమవలచుచున్న
స్వాప్నికంబైన పెనుపలవరముపోలె
నవళభావంపుఁ గలిమి మున్నాచరించు
తప్పిదమ్ములు నాదు చిత్తమున మెరసి

స్మృతికి వచ్చుడు నాయెడల్ చెనఁటికింపు
గొట్టుచును బెద్దరోఁతను గొలుపుచుండెఁ
గుళ్ళి ముఱిగిన దగుపెంట కుప్పవోలె.

౩

నావలని దోసముల నొచ్చి నన్నుఁ గనిన
ప్రజల యలుకచూపులు తలంపంగఁ గొఱవి
మొత్తములచేత నాయొడల్ మొత్తముగను
గాల్చుచున్నట్లు లిపుడును గాఁగుచుంటి.

౪

నాదుచెడుచేఁతలకు నొచ్చి నన్ను స్మృతికి
వచ్చినపుడెల్లఁ బెట్టు శాపములు వచ్చి
తూఁట్లు తూఁట్లుగ నామేనిఁ దొలఁచుచుండెఁ
బుఱుగులుంబోలెఁ; గాకున్నఁ బాడమునొకొ—?
ఇంత యమబాధ? యింతటి? పింతమంట?
యింత యస్వస్థతయు మది కెట్లుఁగాని?

౫

తప్పు నావద్దనున్నను ధర్మసభను
నన్ను నిర్దోషిగా నెన్నినారు బుధులు
తలఁచుకొన్నప్పుడా తీర్పు ములికితోడ
నంటఁ బొడువంగఁ బడుచున్న యట్లు, లెడఁద

వాత పెట్టంగఁ బడుచున్న పగిది, మేని
చర్మమొలిపింపఁబడుచున్న సరణి నగతు.

౬

కరము మేలయ్యె శుక్లపక్షమునఁ బోలెఁ
గాక కృష్ణపక్షమునందుఁ గరణిఁ గ్రమ్మఁ
గటిక చీఁకట్లు హృదయ భాగమునఁ దొలుత
బిదపఁ బండారఁబోసిన విధముగాను
బండు వెన్నెల కన్నుల పండువయ్యె
బాట విస్పష్టముగను గన్పట్టు నింక.

# మ హా త్ము ఁ డు

క. జనుపాంధులకుం గన్నులు,
　　వనస్పతి విఱితికిఁ బుష్పభాగ్యమ్మును, మో
　　క్షనిధిం దరివ్వఁగ సిద్ధాం
　　జనముం దయచేసినావు; చాలు మహాత్మా!

సీ. పాశ్చాత్యమోహశలై వర్తిల్లు హిందూ మ
　　　　హమ్మదీయులకు నైక్యంబుఁ గూర్చి
చిరకాలగతమహాస్పృశ్యతావ్యత్యంబుఁ
　　　　గూఁకటివ్రేళ్ళతోఁ గుళ్ళగించి
పట్టి పల్లార్చుచున్నట్టి మద్యపిశాచ
　　　　మునకు నుచ్చాటనంబును వచించి
శల్యశల్యమునాఁటి శక్తిమెచ్చిన దాస్య
　　　　దుర్రోగమునకు మందును రచించి

గీ. మతగురుండవా? శెట్టివో? మాంత్రికుఁడవా?
　　వైద్యుఁడవా? యను సంశయంపఱచినావు.
　　ఉద్ధరించితి మమ్ము మహాహ్లాద్యమహిమఁ
　　దండిరి! దండంబు మోహను దాసగాంధి!

గీ. ప్రబల దేశదారిద్ర్య జ్వరంబుఁ బాప
　　వచ్చి మందిచ్చినావు ధన్వంతరిగతి

కాని పథ్యంబునడపనికారణమున
సరిగఁ గన్పట్టకుండె నౌషధగుణంబు.

గీ. త్రావకముఖంబునుండి తద్దయును వెడలు
చున్న యొక్కొక్కమాట యొక్కొక్కయుపని
షత్తుగాఁ దోచి యామోక్షసౌధ మెక్క
నైన సోపానమయ్యె మహాత్మగాంధి!

---

# శాపము.

సీ. ముక్తాఫలంబులు భూములు పచ్చగడ్డియు
మొలవని చవిటిపఱ్ఱలుగ మాఱెఁ
బ్రాణికోటులకు జీవనము లిచ్చుచునుండు
వారిదశ్రేణులు వట్టిపోయె
బండ్లకొలంది నెప్పట్లఁ బండులనీను
చెట్లెల్ల ముత్తెంబులఁ జేవదగ్గెఁ
బిదికినఁ గడవలపెచ్చుగాఁ బాలిచ్చు
నెల్లయాలపొదుంగు లెండిపోయె

గీ. నోషధులశక్తి యడుగంటె నూచముట్ట
తీసె విజ్ఞానవాహిని తేమమిగుల
నాసవాలును గాన్పింప కాఱిపోయె
బొత్తిగా దేహబలరేఖ భూప్రజలకు.

సీ. పుడమిపై దేవతాపూజ్యభావముఁగన్న
బ్రాహ్మణతతి పశుప్రాయమయ్యె
లోకకల్యాణావలోకంబుఁ గల్పించు
గ్రహములు దమయనుగ్రహము మానె
స్వాద్యమైనట్టి సుధార్ణవాంతరతరం
గములుప్పతెట్టెలు గట్టియుండె

ప్రకృతిదేవికంఠపరిణామహారంబు
విపరీతరీతులఁ బెరిగిపోయెఁ

గీ. జంద్రసూర్యాగ్నులును దమసహజతేజ
ములను వెలిఁగింపకయుఁ గప్పిపుచ్చుకొనిరి
కనులు గలిగియు నెదుటిది కనఁగలేక
యెదురుదెబ్బలు తినుచుండి రెల్లమంది.

గీ. అతిథివై ప్రతివానిగృహంబుఁ జొచ్చి
పడయకుంట నాతిథ్యంబుఁ గడుపుమండి
ధర్మదేవత రూక్షనేత్రములఁ గనుచు
శాపమిచ్చెనా? లోకంబశాంతిఁబొగులు.

---

# విలాసిని.

గీ. స్తంభము చిత్రించినట్లు; చిత్తరువు బొమ్మ
గోడపై వ్రాయఁబడినట్లు; గుమ్మమంచు
ఘటకవిటపి నిల్చినట్లుగాఁ గానిపించు
లలన యాయాయిచోటుల నిలఁబడంగ.

గీ. తలుపునోర విలంబడ్డ లలనఁ గాంచి
దారి నడతెంచు రసికబృందము దలంచు
లేమొగిలు నంటియున్న బాలేందు రేఖ
అఱతలిరుటాకు పైఁబడ్డ విరియటంచు

శా. కాంచీదామకమూడ్చికింకిణులు మ్రోఁగ స్రేళ్ళతో బిగ్గగా
వించున్ లోయను బాలువాఁగుకరణిం బెంపొందుపయ్యంటఁ గ
ల్పించుం గ్రిందికిమీఁదికిన్, రసికులంబిల్పించు కేల్ గన్నులన్
మించుస్ మించఁబచారు సేయునుహాయల్ మీరంగ వేదీ టిన్.

గీ. తరులకు వసంతఋతువు వత్సరమునందుఁ
గొంతకాలంబె కాని యాకొమ్మఁ గాంచ
సకల కాలంబుఁ బ్రతినిమేషమునఁ గూడఁ
జిగురు వెట్టుచుఁ జిత్రముల్ చిలుకుచుండు.

ఉ. నేలకు గ్రుచ్చికూర్పరిము నెత్తిఁ గరాబ్జమునందునుంచి లం
బాలకముల్ ముఖాంబుజమునందునఁ జిందులు ద్రొక్కుచుండఁగా

బాలపరుండియుండి యొకపార్శ్వమునన్ మఱియొక్క కేలమీఁ
గాళులనీఁది వల్వ సరిగా సవరించుచుచూచుమార్గమున్.

గీ. కనకకాంచికవై రత్నకంకణమయి
పుష్పమాలికవై శిరోభూషణమయి
దీపికాకోరకంబఁయి తేజరిల్లు
లలితలవితాస్య తద్గృహలక్ష్మి కేప్పుడు.

గీ. రసికు లేగెడుతెఱని మార్గమున యువతి
పనిమిషను నిల్చి గృహబహిర్ద్వారమందుఁ
జాపుతన్ముఖరాకా నిశాకరుఁకు
చూడ్కిమంగళహారతు లిచ్చును సతంబు

చ. నడకలఁ గ్రొత్తక్రొత్త రచనల్ పచరించును;నాటపాటలం
గడుఁగడుఁ బారభేదములు గల్పనసేయును;గోపుచూపులం
గడగడలాడఁజేయు సుమశాంధాని; దేహపరిమళంబు లీ
పుడమికినూత్న సౌరభముఁపుట్టఁగఁజేయుమనోహరంబుగన్.

గీ. బందిగొనఁబడ్డ శశిరేఖభాతి, పట్టి
త్రాటఁగట్టిన శంపాలతాభిధానఁ
బంజరంబునఁ గల కీరబాల యట్లు
జాలరంధ్రింబు లందుండి బాల చూచు.

గీ. ముగ్గు దీర్చుచు ముంగిట ముద్దుగుమ్మ
ముందునకు సాగి వంగి సమ్మోదమొసఁగు
నించువిల్కాఁడు పెండ్లి నూరేఁగు వేళఁ
దనరు పల్యంకికావేణు దండమట్లు.

గీ. త్రివళి కోణంబు, గబ్బి చన్గవ యలాబు,
వల్ల నూఁగారు దండంబు, హారలతిక
తంత్రి కాఁగ, సంగీతవిద్యను బఱచు
మరునివీణియ వోలె నాతరుణి పొలుచు.

ఉ. రమ్మని పిల్చినట్టులఁ గరంబులు సాచి కవుంగలింప వే
గమ్ముగఁ బాఱుతెంచుగతిఁ, గమ్మనిపల్కులఁ బల్కరించు న
ట్లిమ్మటమెత్తి పైనిఁబడి యూరకముద్దిడుచున్నయట్లు మో
హమ్మున బిట్టురేఁగి లలితాంగి కనుఁగొ రసికావతంసులన్.

గీ. ఆకుఁబచ్చని మృదుళచీనాంబరంబుఁ
దాల్చియుండియు నెడనెడఁ దరుణి మేను
ఆకులం గప్పఁబడికూడ నంత రాంత
రముల రమణించు తరుశాఖ రహినిఁ దోఁచు.

సీ. పొగబండి పోవునప్పుడు ధూమచయము ల్లు
పసు వెత్తె వెనుకకుఁ గురులగుంపు

రసికులపై ననురక్తిఁ బువ్వులుజల్లు
చున్నట్లు దగఁగటాక్షోచ్చయంబు
చెట్టు కొమ్మకుఁ బ్రాఁకఁజేసు తీవియలట్లు
పైకెత్తఁబడియుండ బాహుయుగము.
తలక్రిందుగా మింట మొలచిన రక్తోత్ప
లములట్లు వెలయఁ బాదముల జంట

గీ. లేఁతనవ్వులు మింట మల్లియలు పూయఁ,
గట్టు పుట్టంబుమడతలు గాలిఁ గదలి
మెఱుమెఱుఁగువాఁక తరఁగల హొయలు గులుక
నతివ మోహినివోలె నుయ్యాల లూఁగు.

క. యువతుల విభ్రమములకుం
గవికృతి వాక్యార్థ మధురగతులకుఁ గానీ
యవధియును గానిపింపదు
భువినిం జూపింపఁబడవు పునరుక్తములై.

---

# ప్రభాతము.

౧

గీ. తూర్పు తెలవాఱుచుండె; నిద్దురను వీడి
రాజగృహమున మంగళారావములకు
నాప్రభాతోత్సవము గాంచ నభిలషించి
పురబహిర్భాగమున కప్పు డరిగినాఁడ.
మహివధూమణి యాపాదమస్తకంబుఁ
గప్పుకొనియున్న నల్లని దుప్పటంబు
మొట్టమొదటఁ దొలంగించి మొగముమీఁదఁ
బిమ్మటఁ గ్రమక్రమముగ సాంతముగఁ దీయు
చున్నభాతి; రాతిరి మూసికొన్న యష్ట
దిగ్దళాబ్జ మల్లల్లన తెఱచుచున్న
యట్లు; నిన్నసాయంకాలమందు నొడ్డఁ
బడిన నిద్దురయురులందుఁ బడియు నెటులో!
వానిఁ ద్రెంచుక ప్రాణులు వెలువఁ జూచి
కాలపురుషుండు తెల్ల మొగంబు పెట్టి
వలను గరములతో మెల్లమెలఁగ లాగు
కొనుచు నున్న తెఱంగునఁ గనఁగఁ బ్రకృతి
మూర్ఛఁ దేఱుచునున్నట్లు; పోవుచుండెఁ
దమము; వ్యాపించుచుండెను ధవళకాంతి.

3

దృష్టిఫలమును గాంచక దిక్కుఁగనక
పరితపించు ప్రాణులకండ్లకిఁ జప్పు దీఁట
ముద్దులను మూటగట్టెడు మూర్తితోడ
నుదయశైలంబుపయి సూర్యుఁ డుదయమొందఁ
బ్రత్యహముఁ బ్రాఁతవడుచున్న ప్రకృతికెల్లఁ
గుందనపుఁబూఁతఁ బూసి క్రొంగ్రొత్తఁ జేయఁ
గిరణములకుంచెఁ గైకొని యరుగుదెంచు
చుండె మెలమెల్ల నతఁడు నేత్రోత్సవముగ

౪

చిన్న చిన్న కౌఁగిళ్ళను జీల్చికొనుచు
మేటిమింటియెడారిని దాటుకొనుచుఁ
బర్వతంబులపై కెగఁబ్రాఁకుకొనుచుఁ
బచ్చికబయళ్ళఁ బేరెంబువాఱుకొనుచు
నెల్లచెఱువుల నదులను నీఁదుకొనుచు
బాలభానునికిరణముల్ వచ్చి వచ్చి
దారిపక్కను జెట్లక్రిందటఁ బరున్న
భిక్షువులబిడ్డలను ముద్దుపెట్టుకొనుచు
మాటలాడుచు, నవ్వించు, చాటలాడు,
చయ్యయిరహస్యములు చెప్పి చాత్మసదన
ములకు రమ్మని పిలుచుచుఁ బూర్ణమైత్రిఁ
జూపుచున్నట్టులున్నని చూడఁజూడ.

౫

తమకుఁ గడచినరాత్రి యందఱకుఁ గలిగి
నట్టి గండంబు దప్పినదనుచుఁ దరులు
హిమకణాశ్రులు రాల్చుచుఁ గొమలు సాచి
కౌఁగిలింప నొండొరుల దగ్గఱకుఁ బిలుచు
పోల్కి గూండ్లఁ గూయుచునుండెఁ బులుఁగుపిండు
ప్రకృతిసతి రత్నభూషణవ్రజము వోలె
నలరుపువ్వులు తళతళలాడుచుండె
రేయిఁ గన్నులుగానక చేయలేక
పయనమును దీవియల సరోవరములందుఁ
బండుకొని లేచి నిద్దురబద్ధకమునఁ
దడఁబడుచుఁ బిల్లవాయువుల్ నడచుచుండె
నప్పుడే రంగుపూసినయట్లు నేల
పచ్చికలచేత నిగనిగల్ పఱచుచుండెఁ
బొలుచు నెల్లయచేతనంబులు సచేత
నములు వలె జీవకళలతో నమరుచుండె

౬

ఆప్రభాతమునందలి యాప్రకృతినిఁ
గాంచఁగా నాకుఁ బదివేలుగన్నులున్నఁ

జాలు ననుకొంటిఁ గాని నిశ్చయముగాను
జాలునో? చాలదో? యొకవేళనున్న

స్ఫటికములఁబోలెఁ దెల్లనిజలముతోడఁ
బాఱుచున్న యచ్చటికొండవాఁగునందుఁ
గాల్యకృత్యముల్ తీర్చి భాస్కరున కర్ఘ్య
మిచ్చి మఱలితి నంతట నింటివైపు.

---

# అగురువత్తి.

గీ. గొలుసుతీరునఁ, బురిత్రాడువలెను, ద్రాఁచుఁ
పాముపిల్లలకరణి, స్తంభంబుపయికిఁ
బ్రాఁకిపోవుచునున్న తీవలతెఱఁగున
నతివయలకలువలెఁ బొగ లతిశయిల్లు.

గీ. కావలయునేని నెవనికై కాని యెట్టి
సమయమునఁగాని తన్ను దగ్ధముగఁ జేసి
పరిమళింపించి కీర్తిధూపముల దెసలు
సంతతమును వానికి మహోత్సవముఁ గూర్చు.

ఉ. గాలికిఁ దాండవించుచుఁ దగం బ్రసరించెడు జమ్మునాగులం
బోలెను, దూదినేఁకుతఱిఁ బొల్చెడుపింజలమాడ్కిఁగా నుషః
కాలపుమూడమంచుసరిగా దెసలన్నియు నాక్రమించి స
ర్వాలయభాగముం దనమయంబుగఁ జేయునువర్తిధూపముల్.

గీ. గాజుకుప్పెఁ గట్టఁగా నుంపఁ బ్రొక్కల
కొరగి వెడలు పొగల వరుసతోడ
గాలిఁ గదలు నాకుగములతో వ్రాలిన
లేఁతవెదురు పొదరు రీతి వెలుఁగు.

---

# సాంత్వనము.

గీ. గగన శృంగార తటిని నౌకపయి నెక్కి
రోహిణీచంద్రమసులు పెఁరుచినిఁ గలసి
విశ్వమోహన గీతలు విసరుచుండ్రి.
మనము గూడఁ బోవుదము రమ్మా! లతాంగి!

గీ. ప్రాంతమున నున్న మావిపైఁ బ్రాకఁబోక
కాంచు మాతీవ యెట్లు కంపించుచుండెఁ?
గుసుమపాత్రంబులోఁ దేనెఁగ్రోలు చవిగొ!
పడఁతి విహరించు భృంగదంపతులఁ జూడు.

గీ. సన్నబంగారు తీవియ సాగఁదీయు
చున్న మెలికలు చుట్టుకొన్నప్పుడు మాత్ర
స్వర్ణకారుండు విసుఁగఁడాపనికి బాల!
తత్స్వభావంబకా మదిం దలఁచి కడఁగు.

గీ. కలువవాల్గంటి యలశీత కరునిఁ గనక
నీవలెనె మూఁతి బిగియించెనే? లతాంగి!
యనుచుఁ బ్రియుఁడు గేదఁగిరేకు నట్టె విసర
మరుములికిచేతఁ బలె నాపె పలిచె దరికి.

---

# విస్మృతి.

౧

సీ. ప్రేయసీ! నాకుఁగల కార్యవేగతమముఁ
గప్పిపుచ్చంగ నీమోముఁ గాంచకుండఁ
బ్రాణసమమైన నీతోడఁ బలుకకుండఁ
దనివితీఱంగ నొకముద్దుఁ గొనకయుండ
నా ప్రయాణంబు సాగించినాఁడ నాఁడు.

౨

బండి సాగుచునుండె; నాభావవీథిఁ
దెలియరాని వికృతిఘూర్ణి కలఁచివైచె
స్మృతికి వచ్చినయటులుండె స్మృతికిరాదు
నాదు విస్మృతవిషయసంతతి లతాంగి!

౩

కొంతకాలంబు గందరగోళపడఁగ
నీదు మంగళమయమూర్తి నిలిచె నెదుట
వ్రేలు గొఱుకుచుఁ గూర్చుంటిఁ జాలసేపు
పుచ్చినట్లుగ నాబుద్ధి, మూఁతవడిన
యట్లు నాదైన ధారణ, యాత్మఁ గంటిఁ
బాపకార్యంబు సేసిన భాతి మనసు

నొచ్చుకొనుచుఁడె సూదుల గ్రుచ్చినట్లు;
దేహబంధంబు సడలెను ; దీప్తి దఱగె
బరువుగాఁ దోఁచుచుండెను బయనమపుడు.

౪

మొదట నీవె విస్మృతి నిద్రఁ బుచ్చి నన్ను
నూలదైవంబ ! స్మృతిచేత మేలుకొలిపి
తకట ! నేఁగుందుచుండంగ హర్షపడుచుఁ
దాండవింతువు కాఁబోలుఁ గండుమీఱి.

——·—·

# పుష్పాపచయము.

మ. మకరందంబు స్రవింపఁగాఁ, బరుగిడన్ మందంబుగా మారుతా
ర్భకముల్ పైఁబడి, విచ్చియున్న కుసుమవ్రాతంబు నా మధ్యఁబ
త్త్రికదంబంబులు. నేత్రపర్వమగుచున్ రాణించుచున్నట్టి వృ
క్షకమున్ డాసి యొకండు గోయఁదొడఁగెం గాఁ బుష్పముల్
కాంచితిన్.

మ. కనుచుండంగనె తెంపి యెల్ల విపులం గల్పించెఁ జూఁ జెట్టునా
తన నైర్ధయ్యముఁ గొన్న బాలు దయా దాక్షిణ్యముల్
మాని, యా
తనికిం కార్యము కాదు గూడదని బోధల్ సేయదో ? యంతరా
త్మ నిగూఢంబుగ, నంతరాత్మ యును లేదో? నాని కేలేశమున్

గీ. కన్నుదోయిని బాష్పముల్ క్రమ్మె నాకు
నప్రయత్నంబుగా నిట్టులంటి నతని
నేమి దుర్బుద్ధిరా? యిది యిట్లు సేఁత
కనులు గుట్టెనే ? చేతులు కావె ? నీవి.

గీ. తరువులం గల పువ్వులఁ దరులయందె
సలిపి కనువిందుగా దాని చెలువముఁ గని
నార్ష పడలేవె ? సర్వ శూన్యముగఁ గోసి
మోపిడుఁ గని కాని సంతుష్టిఁ బొందలేవె?

చ. భ్రమరము లెంతదుఃఖపడి పాపపుశాపము లిచ్చునో ? మరిన్
ద్రుమతతి సొత్తుదొంగిలి రి దొంగలటంచెద నెంతయేడ్చునో!
తమవగు పుణ్యతీర్థములు తద్దయు రూపఱె నంచు మందవా
తములవి యెంత క్రుళ్ళునో ! కదా ! గ్రహియింపవు నీవు మూఢుఁడా !

గీ. అయ్య ! లక్షసుమార్చనం బాచరింతు
నీశ్వరున కీదినంబున నీసుమములు
చాల ; వీయన్ని చెట్లపుష్పములు గోయ
వలయు నింక నటంచును బలికె నతఁడు.

గీ. చెవికిఁ జేఁదైన యతనిభాషితమును వినఁ
గానిఁబడి కొట్టి తోటయావలకు గెంట
వలయు నన్నంత కోపంబువచ్చెఁ గాని
మెట్టులో ! మ్రింగి వానితో నిట్టులంటి.

ఉ. క్రోలఁగఁ గ్రొత్త తేనియలఁ గుత్తుకబంటిగఁ బేరుటాసతో
వ్రాలుచునున్న తుమ్మెదలఁ బాఱఁగఁదోలుచు దేవపూజకై
పూలనుగోతువో ! మొగముముందటికూటిన్ దీసివేసి పా
పాలకు భైరవుండవయి వర్తిలుచుంటివటంచెఱుంగు దే.

గీ. ఇన్నిప్రాణులు దుఃఖింప నేవలేక
కోసి యీకోమలము లైన కుసుమములను

నీశ్వరునిపూజఁ గావించి యేమిఫలము
నాందఁగట్టుచున్నావో? నాకు మూర్ఖ! చెపుమ.

గీ. ఈశ్వరుఁడు గోరునది నీదు హృదయసుమమె
కాని యీ చెట్ల పువ్వులు గావు కావు;
అంతగాఁ గావలయు నన్న నవిగో! యేటి
కొనుము! రాలినపువ్వులు కోట్లకొలఁది.

గీ. పరిమళించెడు మవ్వంపువిరులు గోసి
జీవకళలేని రాతిఁ బూజించుకంటెఁ
బూలఁ, బండుల, నాకులఁ, బొలిచి కనుల
విందు సేయుచెట్లకు మ్రొక్క వెఱ్ఱివాఁడ!

చ. అని వచియించునప్పటికి నాతని కయ్యది వచ్చి నేను జె
ప్పినయది ధర్మబద్ధమని పెల్లనుతాపముఁ గాంచి బుద్ధి వ
చ్చినయది; యింక నెన్నటికిఁ జేయనునిట్టియకార్యమేనొన
ర్చినయది శుద్ధతప్పనివచించెఁగనుంగవఁగ్రమ్మబాష్పముల్

# ఇంద్రచాపము.

కం. శ్రీయుత ! మీ దే దేశము ?
నీయట్టి మనోజ్ఞమూర్తినిం గనె నెవరా
మీయమ్మ ? యెచటఁ గొన్నా
వోయీ ! యీ దినుసుదుస్తు లొయ్యన చెపుమా !

గీ. కార్మొగులునాఁగ నల్లఁగాఁ గానిపించు
పెట్టియను బెట్టి దాఁచిన యట్టివేమి ?
వాన రాఁబోవుచున్నది ; దాన నీదు
రంగుబట్టలు తడిసి పోరంగు దగ్గ.

గీ. నాదు మందసమునఁ దటిన్మయము లైన
కాంచికాలత, ముద్రికల్, కంకణములు
హారములు, నూపురములు, చీనాంబరములు
కలవు ; నాప్రియ ప్రావృడంగన ; తదర్థ
మరుగుచుంటి ; వాల్మీకి మహర్షి సోద
రుఁడను ; విశ్వకల్యాణకారుఁడను నేను.

# అంధబాలుఁడు.

గీ. వెలుఁగు వెలుఁగని మీరెల్లఁ బిలుచునట్టి
వస్తువెయ్యది? దానిరూపంబదేమి?
దృష్టిలాభంబుచే ఫలంబేమి మీకుఁ?
బలుకుము సఖుండ! యీయంధబాలకునకు

గీ. వేయివెలుఁగులతో రవి వెలుఁగు ననియు
వింత వింత పదార్థముల్ కాంతు మనియు
ననెద; వాతండు వేఁడియంచును గ్రహింతుఁ
గాని యెట్టుల రేయిబగళ్ళు సేయు?

గీ. రేబవలు నాకు నేనయి సృష్టిసేతు;
నతని సృష్టితో నాకుఁ గార్యంబులేదు;
నాదు జాగరణావస్థ నాకుఁ బగలు
నాదు గాఢసుషుప్తియు నాకు రాత్రి

గీ. అప్రతివిధేయ దుస్థితియందు నుంటి
ననుచు ననుఁగూర్చి మీరెల్ల వనరుచుంద్రు
కాని నాకయి తెలియంగరాని యెల్ల
దుస్థితి సుఖంబుగా సహింతును సఖుండ!

గీ. నామనంబున నున్న యానందమునకు
నష్టమును గూర్పవలవదో నాప్రియుఁడ!
అనుదినము హాయిగాఁ బాడుకొనుచునుండ
గ్రుడ్డినైన మహారాజుబిడ్డ నేను;

N B. ఆంగ్లమున కిబ్బర్ (Cibbar) కవివ్రాసిన The blind boy యనుదాని యనువాదము.

---

# ప్రార్థన.

గీ. సూర్యభగవానుఁడా! నీదు శోభమాన
కరసహస్రంబు గాత్రంబుఁ జొఱఁగఁ జేసి
నా కుమారునస్వస్థత నూకివేసి
స్వస్థవృత్తంబుఁ గూర్పు మంజలి నొనర్తు

గీ. చంద్రుఁడా! తావక మయూఖ జాలకమున
సుధను జొప్పించి నాప్రియసుతుని మేన
మాన్పి పీడించు నీవిషమజ్వరంబు
స్వస్థవృత్తంబుఁ గూర్పు మంజలి నొనర్తు.

గీ. అన్న! ధన్వంతరీ! దస్రులార! మీరు
కామధేనువు పాలనో? కల్పవృక్ష
ఫలరసాయనమో? స్వర్గవర్తులయిన
యౌషధంబులో? కైకొని యరుగుదెంచి
నా కుమారు నస్వస్థతఁ గాకుసేసి
స్వస్థవృత్తంబుఁ గూర్పుఁ డంజలి నొనర్తు.

---

# పంచవన్నెలచిలుక.

౧

సీ. ఇంబడరు శక్రచాపఖండంబువోలెఁ
దైలబిందువు పడినట్టి తపఁగవోలె
రంగురంగుల పువ్వులరాశి వోలె
సరసవనలక్ష్మికిఁ బ్రాణసఖియుఁ బోలె
భావశబలతఁ గైకొన్న స్వాంతమువలె
వివిధవర్ణభూషలు దాల్చి ప్రియునికొఱకు
నుత్సహించుచుఁ గూర్చున్నయువతివోలె
సృష్టిసౌందర్యమంతయు నేకవస్తు
గతము గావింపఁబడినపద్ధతిని మిగుల
ముద్దులను మూటఁగట్టెడు మూర్తితోడ
మోదమున ముగ్గితేలెడు మొగముతోడ
నయనపర్వంబుఁ జేయుచున్నావు నాకు
స్వాగతము నీకు నోపంచవన్నెచిలుక!

౨

అమరలోకంబు నందు నిత్యము వసించు
చుండి వాహ్యాళికోసమై యుర్వి కరుగు
దెంచు కిన్నరకన్యవో? యంచుఁదలఁతు
నమ్మఁగాఁజాలఁ బక్షిమాత్రమ్మ వగుట

నేసువర్ణఖండమున జన్మించినావా?
యేమహర్షి వరంబుల నెలసినావా?
అహహా! యేపుణ్యనదిఁ దీర్థమాడినావా?
పంచవన్నెలచిలుకా! వచించుమమ్మ.

౩

వాహనంబుగఁ గైకొని పంచశరుఁడు
నిన్నుఁ గల్యాణమూర్తిని నిలుపఁబట్టి
కాక త్రైలోక్యవిజయి యై కాలెఁగలఁడె?
లాఁతి పులుఁగైనచో నంత ఖ్యాతిఁగనునె?
నీదు చక్కఁదనంబును నిశ్చయముగ
నపహరించెనో? యేస్వల్పమైన రతియుఁ?
గానిచో నట్టి యందంబు గలుగునెట్లు?
నిన్నుయాచించి నీరామణీయకంబు
నెరువుఁ గొనిపోవుచుందురో సురతరుణులు
మునుల తపములఁ జెఱచెడు పనులకొఱకుఁ
గాక మోహింపఁగాఁ జేయఁగలుగునెట్లు?

౪

పండ్ల రసమును దాగిగుటఁ బట్టియేమొ!
అంత మధురంబుగాఁ మాటలాడఁ గలవు;
అంత సుందరమూర్తివి యగుటనేమొ;

అంత ముద్దులుగులుక మాటాడఁగలవు ;
ఉల్లమున నంతయుల్లాస మూఱునేమొ !
అంత శ్రావ్యంబుగా మాటలాడఁగలవు
ఆననను కాదు ; నీదు ప్రత్యంగయమరయ
నమృతము స్రవింపఁగా మాటలాడుచుండు.

---

# మహాసాహసి.

గీ. గిరిగుహాగర్భమందు సాగరముక్రింద
భయదమైన మహాజల ప్రళయమందు
వ్యోమమున దుర్గమారణ్య సీమమునను
బాలకునిమధ్యనుం బ్రేమ త్రోవఁజేయు..

గీ. అబలవౌ దుర్బలంబుగా; దద్దిమఱియుఁ
బిఱికిగొడ్డును గా; దది వేయిమంది
కాచుచున్నను రక్షకుల్ కాదటంచుఁ
దోసికొని పోవుచుండును త్రోవఁజేసి.

గీ. వెలుపటికి దాని రానీక బెట్టిదముగఁ
జెఱను బాధింతు రొందఱు; చెప్పుచుందురొ
కొంద ఱయ్యది శాపము గ్రుడ్డి దనుచు;
ఏఁడు ప్రాకారములమధ్య నెసఁగుఁ గాక
గ్రుడ్డి దగుఁగాక జనులు వాకొన్నరీతిఁ
దోఁచినట్లేఁగఁగాఁ బ్రేమ త్రోవఁజేయు.

* గీ. ప్రాగ్దిశకుఁ బాఱు కావేరిఁ బడమటికినిఁ
బడమటికిఁ బాఱు నర్మదం బ్రాగ్దిశకును
ద్రిప్పఁగా వచ్చు మనకు యత్నింపఁ; గాని
తివిరి ప్రేమప్రవాహంబుఁ ద్రిప్పఁటలేది.

ఆంగ్లము నందలి The great adventerer అనుదానియనువాదము.

* ఇది మదీయము.

# ప్రియాగమనము.

గీ. కడపియును బెద్దతడవు నాకలికిమిన్న
యేఁగుదెంచంగఁ దనపుట్టినింటినుండి
దారుణంబైన మూర్ఛను దేఱినట్టు
లడవిలోనుండి యీవలఁబడిన భాతిఁ
జెనఁటిగుడ్డితనంబు నశించినక్రియ
భయదమగు రాత్రి చని పవల్ వచ్చినగతి
శాపమోక్షంబుఁ బొందిన జన్మమువలె
దుర్దినంబుల పదఁపడి దోయజాప్తు
నుదయమైనట్లు నాకు నాయునికి దోఁచె
ముడుచుకొన్న నా హృదయంబు పొడవుసాగె
వేయి చందురులు నాయింట వెలిఁగినట్లు
కుసుమవర్షంబు నాపైనిఁ గురిసినట్లు;
ఇదివఱకులేని యుల్లాస మెగిరివచ్చె
వచ్చునపుడామె తనతోడఁ దెచ్చినట్లు
కడిపియును బెద్ద తడవు నాకలికిమిన్న
యేఁగుదెంచంగఁ దనపుట్టినింటనుండి.

---

# ధైర్యస్థాపన.

గీ. కనులు గుంటలువడఁగ మొగంబు తెలుగఁ
బాలుగారెడు చెక్కిళ్ళు పాలిపోవఁ
జిక్కి సగమయి చెంపపైఁ జేయిచేర్చి
శూన్యమతితోడ యువకుఁడా! చూతువేల?

గీ. సరసుఁడా! భవదీయాంగసౌష్ఠవంబు
నీప్రియాచిత్తముఁ గదల్పనేరకున్నఁ
గట్ట! యీదృశరూప మెక్కరణి నేర్చు?
నీరుతీసిన చెఱువెల్లు నెఱపుఁబ్రీతి?

గీ. కాముకా! మూఁగవై పెడమోము సేసి
తేల? నీయింపుమాటలు చాలకున్న
మూకభావంబు నీప్రేమమూర్తిదైన
చిత్తము హరింపఁజాలునే? చెప్పుమయ్య!

గీ. సిగ్గుచేఁటివి విడువుమా! లగ్గు గాదు;
ఇవ్విధంబుల నీప్రియాహృదిని లవముఁ
గదలఁబాఱింపఁ జాల; వాకలికిమిన్న
తానయి వరించినంగాక దప్పిపుట్టి.

N. B. ఆంగ్లమున Sir J. Sucklingవ్రాసిన 'Encouragements to a lover' అను దాని యనువాదము.

---

# సురుచి.

గీ. ఆఁడుపిల్లలలోపల నందకత్తె
మిన్న మాయింటిపొరుగున నున్న సురుచి
ఆపె మోహనముఖకాంతి నర్ధమైనఁ
గలిగినట్టిదొక ర్తయుఁ గానఁబడదు.

గీ. బాల చిఱునవ్వు లక్షవరాలు సేయుఁ;
గొమ్మ మధురంపుఁబలుకులు కోట్లుసేయు;
సుదతి కందోయితమ్ము లర్బుదము సేయుఁ;
జెలియ నెమ్మెనికాంతికి వెలయు లేదు.

గీ. తండ్రి గతియించె; పిల్లతోఁదల్లి యచట
బ్రతుకుచున్నది యాయవారంబు నెత్తి
అట్టివారింట నాపిల్ల పుట్టఁగూడ
దొక మహారాజునకుఁ బుట్టియున్నఁ జెల్లు.

గీ. ఆపె నామానసమునకు దీపకళిక
ఆపె నాకన్నుదోయికి నమృతవల్లి
ఆపె నామనోవ్యాధికి నౌషధంబు
బాల యొకటేమి ? నాకు సర్వస్వమగును.

గీ. తల్లి గృహమందు లేకున్న తరుణమందు
వారి యింటికిఁ నేఁబోయి పలుకరింపఁ

జేతిలోనున్న పని విసర్జించి మంద
హాసమున వచ్చి నాచేతులందు వ్రాలు.

గీ. పరుల సమ్ముఖమందాపె వచ్చు నన్నుఁ
గనుచుఁ గ్రేఁగంటఁ బలుకరించును సతంబు
బడికిఁ బోవుచు వచ్చుచు వారియింట
గడియకాలంబు కొమ్మతోఁ గడపుచుందు.

గీ. అనుదినముఁ గళాశాలకు నాలసించి
చనుట, నిచ్చలుఁ బాఠముల్ చదువకుంటఁ
దప్పుచుంటిఁ బరీక్ష ; నాతండ్రి నన్నుఁ
దిట్టిపోయుచుఁ జీవాట్లు పెట్టి వ్రాయు.

గీ. వాని నన్నింటి నోపికపట్టి సైతు
నాదు ముద్దులమూటకై యాదరమున
ఆచెలువఁగాంచఁ బ్రాణంబులేచు నాకు ;
నన్నుఁ గాంచినఁ బొంగు నాచిన్నదియును.

గీ. బడికి విశ్రాంతిదినమెల్లఁ బర్వదినము
నాకు ; నానాఁడు సురుచితోఁ నాటకంబుఁ
జూడఁబోదును ; మంచిదుస్తులను దొడిగి
పూలతోఁటకుఁ జనుదుము రేలయందు.

గీ. మరియు నాదిన మాకెపుడు మంచిమంచి
వాసనాతైలములుఁ బూలుఁ బండ్లుఁ దెత్తు
దైలమునుఁ రాచి తలదువ్వి పూలు ముడుచు
కొనును; గవగూడి యాపండ్లు దినుదుమేము.

గీ. ఊర దేవునితిరునాళ్ళ యుత్సవమ్ము
రాఁగ నాముద్దుగుమ్మతో రమ్యముఁగను
నంగడులకేగి వలసినయన్ని వస్తు
వులను గొనియిచ్చుచుందు సొంపులుదలిర్ప.

గీ. మాదు శృంగారనాటకమధ్యమందుఁ
బరిహసించుచుఁ జప్పటల్ చఱచుచుంద్రు
ప్రేక్షకులు; తత్పరీహాసవిధము గాని
చప్పటలు గాని మాకథం దిప్పలేదు;

---

# నా ప్రేయసి.

గీ. ఆలలన నెమ్మొగం బొకపూలతోఁట;
అందుఁగల పువ్వులుం బండ్లు ననుఁదింబుఁ
గాన్కగా నాకుఁ బంపును గాని తాను
లక్షవరహాలొసంగిన లాఁతి కిడదు.

గీ. ఆలలిత గాత్రి మొక్క రత్నాలరాశి
యన్యులకు లోభనీయంబ యగునుగాని
దాని వెలఁగట్టఁగా లేఁడ నేను దక్క
దానిఁ గొనలేఁడ యన్యుండు నేనుదక్క.

గీ. ఆరమణిచిత్త మనురాగమారుతంబు
మలయు నంతఃపురోద్యానమంటపంబు
అటకుఁ జన నాకుఁ మాత్రంబె యాజ్ఞగలదు
పరులు చొఱకుండ మూయఁగాఁబడునుదలుపు.

గీ. ఆవనిత మోవియందు లాస్యంబుసేయు
చున్న చిఱునగ వమృతంపుజున్ను; నాకుఁ
గానఁబడుఁగాని పరులకుఁ గావఁబడదు
పుట్లకొలఁది పుణ్యంబు సల్పుకొనియుంట.

---

## మృగతృష్ణ.

గీ. ఇదిగో! పువ్వులతోఁటకు నేఁగుచుంటి
నటకు రావోయి! యని పిల్చినట్టులున్న
యువతి క్రేగంటిచూపు లుబ్బూతలూఁపఁ
బోయి కూర్చుంటి నట నడిరేయిదాఁక.

గీ. నెమ్మొగంబు మలంచి కనీనికలను
వికసితోత్పలపంక్తులు వెల్లివిరియఁ
గనుచుఁ జనుచుండ మెలమెల్ల వెనుదవిలితిఁ
కాసి ననుఁ గాంచి తరుణి ప్రక్కకుఁ దొలంగె

గీ. తగులువడ నాదు హృదయపతంగకంబు
కలికి మేనియొయారంపువలలు పన్ని
పొంచిచూచును గాని నేముందుపడఁగఁ
గానఁగా రాక మూఱును గర్భగృహము.

గీ. చనుచుఁ జనుచుఁ దటాలున గనులువిచ్చి
కాంచి తత్క్షణమందె కుంచించుచున్న
యువతిచూపులు నామది నుచ్చిపోవ
నుత్తరించితి లేదు ప్రత్యుత్తరంబు.

గీ. ప్రకృతి సిద్ధంబులైన యాపంకజాక్షి
చేష్టితములకపార్థంబు సేసికొంటి
నెండమావులఁ గాంచి పర్వెత్తినాఁడ
దప్పిదీఱంగ జలమును ద్రాగఁదలఁచి.

---

# సుందరి.

గీ. కలవు నాదగు హృదయరోగముఁ గుదుర్చు
మందుమాత్రలు పొరుగింటిసుందరికడ
నాకు నధరామృతానుపానంబుతోడ
నాల్గుపూఁటలు సేవింప నయము గలుగు.

గీ. చవుడు బాఱియు మిగుల నిస్సారపడిన
నాదు జీవనకేదారవీథియందుఁ
జల్ల సుందరి విభ్రమసారరాశి
బహుముఖంబుల బంగారుపంట పండు.

గీ. బెట్టిదమ్మగు వఱపుచే బీడువడ్డ
నాదు హృదయంబు తేమ పూర్ణముగ నిగిరె
వచ్చి యాసుందరి సువృష్టి పఱుపకున్న
మొండికెత్తును గృషిసేయఁబోవునాకు.

గీ. నట్టువపులుంగురీతిగా నాకు ముందుఁ,
బ్రక్కఁ, దిరుగుచు నోరలువార నగుచుఁ
బలుకరించుచుఁ గంకణక్వాణముమిషను
గాసఁబడెనేని సుందరి కలదుబ్రదుకు.

---

# మెఱపుదీఁగ.

గీ. కాఱులు తొలుకారు వెలఁదిబంగారుబిడ్డ!
మొగిలునంతిపురింబొల్చు పువ్వుఁబోఁడి!
ఓసి శంపాలతా! పదంబూనవు భువి
నిలిచి మాటాడవొకనితో నిముసమేనిఁ
బిడుగు మొత్తంబు సలిపెడు బిట్టులివుకు
జడిసితో? వాన చినుకులం దడిసిపోదు
ననియొ? మోహపిశాచంబు వెనుదవిలెనో?
తావకాంగంబునకు దృష్టితాఁకుననియొ?
పనిమునిఁగిపోయెనో? స్త్రీ స్వభావజమగు
హంసగతులును వేదండయానములును
వదలి శరవేగమున నిట్లుపఱతువేల?

---

# సౌందర్యలుబ్ధుఁడు.

గీ. సుందరంబగు వస్తువు చూడ్కులకును
నాకుఁ గానంబడ నచేతనంబె కాని
చేతనమె కాని దానిని స్వీయముగను
జేసికొన రేబవళ్లు వాంఛించుచుందు.

గీ. కలికి యగుఁగాక పురుషుండె కాక యంద
మగుపదార్థంబు ముద్దాడ నభిలషింతుఁ
బరులు ననుఁ దిట్టుదురుగాక పరిహసింతు
కాక తెలుపక దానినిఁ గప్పఁజాల.

గీ. నాకొసంగక యేల సుందరపదార్థ
మన్యులకొసంగి? తని దేవు నాడిపోతు
దాలనుండియు దాని సౌందర్యరసము
వీలు చిక్కించుకొని పోయి కొల్లుచుందు.



# నా మనః ప్రవృత్తి

౧

గీ. ఓయిమానస! నీకు వైద్యుండు సెప్పి
నట్టిదేమి? నీచేయుచున్నట్టిదేమి?
కదలఁబోకుమ! అదియిది కావలెనని
పట్టుఁబట్టకు మేమియుఁ బలుకవలదు
జాగరూకతఁ బథ్యంబు సలుపుచుండు
శాంతముగ నుండు; కాని పక్షమున నీకు
వ్యాధి కుదురదటంచును బలుకలేదె?
అదియ నీకౌషధంబని యనఁగలేదె
మఱచితివా? కాక నిర్లక్ష్యపఱచినావా?

౨

కదలుదువు; మాటలాడుదు పదిఁబదిగను;
లేచి కూర్చుందు; నవ్వుదు చూచుచుందు
మంచివస్తులు మవ్వంపు మించుబోండ్లు
పూలమేడలు వరహంసతూలికలును
స్వర్ణపాత్రలు రత్నాలపాదుకలను
నందలంబులు నాకాశయానములును
గంటికింపైన యవియెల్లఁ గావలయును
రసన కాంక్షించునదియెల్ల మెసఁగవలయు

వీనులకు రుచించునదెల్ల వినవలయును
దెమ్ము తెమ్మని నన్ను బాధింతువకట!

3

తెచ్చియీకున్న దీనతం దేలుకొనవు
కాని పోనీకదా యని కావలసిన
దొకటి యొసంగిన శిశువున కోజఁ గోర్కి—
యొకటిపిమ్మట వేఱొక్కఁ డూరుచుండుఁ
దనివియనుమాట నెన్నఁడుఁ వినియెఱుఁగవు.
ఈయపథ్యంబుచే రోగమెట్లుకుదురు?
కుదురవలె రోగమని నీవు కోరుకొనవా?

౪

కోపపడ నూరకుందువు కొంతసేపు
క్రమ్మఱ యథాపురంబుగాఁ గావలెనని
యూపిరినిఁ దీయుచుందువ; యొప్పిదముగ
వైద్యుఁడే తెంచి చెప్పిన పలుకులెల్ల
నడపుదు-నటంచుఁ బ్రతినలు నుడివి నుడివి
యాతఁడు మొగంబు ద్రిప్పఁగా నకట! మరల
నెప్పటాటల నాడుదువేల! చెప్పుమ
ఈయపథ్యంబుచే రోగమెట్లు కుదురు?
నాకు నానంద మెట్లు మానసమ! కలుగు?

———

# పుణ్యపాపములు.

గీ. బాలకులఁగాంచె నిద్దఱఁ బ్రకృతిమాత
పుణ్యపాపాహ్వయంబులఁ బొలుచువారి
వారిలోఁబెద్ద బంగారు సౌరువాఁడు
సర్వశుభలక్షణాఢ్యుండు సౌమ్యమూర్తి

గీ. బంశికండెనతో బాంధవంబు నెఱపు
మేనివాఁడు; జుగుప్సితంబైన మోము
వాఁడు; సర్వావలక్షణప్రాభవుండు
ఆకనిష్ఠుండు దగు విరూపాంగకముల.

గీ. జాతకంబులు వ్రాసిరి శాస్త్రవిదులు
పొలుచుఁ బ్రథముండు పురుషోత్తముఁడుగననుచు
రెండవకుమారుఁడధమాధముండు మఱియు
నన్నఁబాఱంగఁదోలుఁ బెద్దయిన ననుచు

మ. జననంబొందెనో? లేదో? యాద్యుఁడుదగన్ సంప్రాప్తతా
రుణ్యుఁడై
వినుమార్గంబున నెల్లలోకములకున్ విచ్చేసె బంగారు తే
రునఁగూర్చుండి తదీయకాంతి వితతిన్ రోదస్సుమిర్మిట్లు లం
గొనఁగాఁబర్వఁగఁగమ్మ సంపఁగులనర్ఘ గొత్తావులున్ గుప్పనన్.

మ. ఘనకాండంబులువ్యోమసీమనువలెన్ తన్మామండలంబెల్లనా
తనిచారిత్రము వానిదివ్యమహిమల్ తత్కీర్తులుస్ బ్రాకెఁజే
యనదైవాంశము;వీనికొల్పుశుభదంబంచున్ ప్రజల్ రాజ్యమా
తనికర్పించిరి వానియేలుబడికిన్ దాస్యంబుఁ గావించుచున్.

శా. బాలారిష్ట పరంపరల్ కలుగుటన్ ప్రాణావశిష్టుండునై
కాఘల్ చేతులునీఁచఁ బోఁగ నిలువంగాలేక పారాడలే
కోలిన్ మృత్యుముఖంబునంబడుచుఁదానొక్కొక్క మాఃరీగతిన్
బాలుండొప్పెద్వితీయుఁడప్డు విడువక్కాదజ్జీవితాశంప్రజల్.

గీ. మంను మాటలు లేకయు మానసీయ
ప్రకృతిమాత యొసంగిన పాలుద్రావి
తేకుకొనియొళ్లుసేసి విద్దెములు సేసి
యడుగిడఁగనేర్చి పెద్దవాఁడయ్యెనతఁడు.

గీ. అన్నలోకంబులెల్లలోఁ గొన్నవాఁడ
తండు గీసిన గీఁతను దాఁటదుప్రజ ;
నిలువనీడయునాకుఁ గాన్పింపదనుచు
సతఁడు గుములుచు దృఢనిశ్చయమునఁదుదకు.

శా. ప్రాగుంబోతులు జార చోరులును ధూర్తవాత్రముల్
కుత్సితుల్
రాగద్వేషులు మత్సరుల్ తనకు మిత్రశ్రేణికాఁగా మహా

భాగుండైతగు జ్యేష్ఠసోదరునితోఁ బల్మారుపోరాడఁగన్
వీఁగుం, బైఁబడి దూపుమాపఁదలఁచున్ జిత్తంబునందాతనిన్

ఉ. తమ్ముని దుష్టవర్తన కతంబుగడుంగదు నమ్మలించి చి
త్తమ్మున, వాని, మిత్త్రులను, ధర్మమునీతియుఁ దెల్పి చెడ్డ మా
ర్గమ్ముననుండి త్రిప్పుటకు ఖండప్రయత్నముఁ జేసెఁ గాని హా
స్యమ్మొనరించి వారపుడసహ్యపుఁగూఁతలుకూసి రుద్ధతిన్.

గీ. ఇట్లు జ్యేష్ఠుని హితబోధ లేవగించి
వాఁడుగూడుపుటాణియై వారితోడ
బలిమి నేమఱుపాటునఁ బైఁబడంగఁ
దలఁచె; మిత్రాంగమీరీతి సలిపితజని.

మ. తనసిబ్బందిని వెంట బెట్టుకొని యాతమ్ముండు రౌద్రంబుగాఁ
గనులన్ నిప్పులుగ్రక్కుచున్ బొమముడిన్ గల్పించుచున్ మోమునం
దునఁ, గావించుచు సింహనాదములుత్రోఁ ద్త్రోఁబండులంగీటుచున్
దునుమంగత్తిని నెత్తె సోదరునిపై దుర్దాంతకోపంబునన్.

గీ. తమ్ముఁడా! యేలనాప్రాణమ్ముఁదీసె
దేదినానుండికోరెదో? యిత్తుననుచు
నన్న; తమ్ముండు సర్వరాజ్యంబొసంగి
యడవులకుఁ బొమ్ము తత్క్షణంబనుచుఁబలికె.

ఉ. ఆతనివాలకంబునకు నన్నయలందరి బుజ్జగించుచున్
భ్రాత కొసంగి రాజ్యమున నాలవభాగముఁ బంపఁ,బోయి పి
న్నాతఁడు క్రమ్మఱం గలహమాడఁగఁ జాతికపాలొసంగెనీ
రీతిగఁ బావుపావుగ హరించెను రాజ్యమునెల్ల మెల్లఁగన్.

గీ. ఆ కనిష్ఠుండు సకల రాజ్యమును బొంది
తనదు మిత్త్రులు రాజ్య తంత్రమును నడప
శత్రుపక్షమున్మూలించి జరుపుచుండెఁ
బాలనంబు నేకాతపవారణముగ.

ఉ. శ్రీతరుణీమనోహరునిఁ జిన్మయరూపుని సంస్మరించుచున్
భ్రాతహరింపరాజ్యమునరణ్యముఁజొచ్చెను జ్యేష్ఠుఁ;డాముని
వ్రాతము భక్తితో నెదురువచ్చియుస్వాగతమిచ్చికొల్చిసం
ప్రీతునిఁజేసి, రక్షలకుఁ బేరిమిగల్గదె? కానకేగినన్.



# కురంగము.

"యద్వక్త్రం ముహురీక్షసే న ధనినాం బ్రూషే న చాటూన్ మృషా
నైషాం గర్వవచశ్శృణోషి నచ తాన్ ప్రత్యాశయా ధావసి
కాలే బాలతృణాని ఖాదసి పరం నిద్రాసి నిద్రాగమే
తన్మే బ్రూహి కురంగ! కుత్ర భవతా కిం నామ తప్తం తపః"

చ. ధనికుల మోములంగనవు; దద్దయువారలఁ జాటువాక్యలం
దనుపవు; వారిగర్వ వచనంబులనేన విన; వాశవారి డా
యనుజన; వింత లేఁకకసవాఁకటి వేళకుమేసి నిద్రవ
చ్చిన నిదురింతు; వేతపము నేసితివో; చెపుమా! కురంగమా!

# ద్వీపాంతరవాసము.

గీ. భటులు నాపేరుపెట్టి మూమ్మారుపిలిచి
నేను దద్ధర్మసభ కేగి కేలుదోయి
కట్టుకొని ప్రాడ్వివాకుని కట్టెదుటను
నిలిచియుంటిని గుండెలుగొట్టుకొనఁగ.

గీ. వారు నను గ్రుచ్చి గ్రుచ్చి ప్రశ్నములమీఁదఁ
బ్రశ్నములవేసి దోషిగా నిశ్చయించి
నాకు ద్వీపాంతరపరివాసంబు శిక్ష
వేసిపంపిరి నేనెంత మొత్తుకొన్న.

సీ. ఒకసారి రెక్కలనూఁగించుచును మింటఁ
బఱచెడు పులుఁగుల బంతిఁగాంచి
ఒకతేప వాత్యావిధూతంబులై కడుం
గడుఁ బాఱుతెంచు మేఘములఁగాంచి
ఒకమార నంతసాగరముభేదించి యా
వలిగట్టుఁజేరు నావలనుగాంచి
ఒకపారి యంత్రసామగ్రిబలంబుచేఁ
జదలఁబర్విడు విమానములఁగాంచి

గీ. తద్గతుల నభ్యసింపంగఁ దలఁచితలఁచి
బిక్కమొగమునఁ బరికించి దిక్కులకట!

దుర్మనాయమానుండనై తొట్రుపడుచు
సంచరించుచునుంటి నీస్థలమునందె.

గీ. ఇంక నీజన్మతో నాకు శిక్షదప్పి
నీముఖాంభోజమునుగాంచి యెల్లవేతలు
మఱచి ముచ్చటలను నాడుకొనుచునుండు
భాగ్యమదినాకుఁబట్టునే? ప్రాణసఖుఁడ!

---

# భీ తి.

గీ. పుడమినాఁగ మహాశక్తి ప్రోత్సహించి
పంపియున్న పిశాచంపు గుంపులట్లు
తలలు విరియఁబోసికొని భయాత్మకములగుచుఁ
జెట్లుమొత్తంబు నన్ను వీక్షించుచుండె.

గీ. అలదిగంత విశాలమహాంబరంబు
నన్నుఁ గబళింపవచ్చుచున్న కాల
దేవతా వివృతాస్యంబు తోఁచ నాకు
నడులుగొలుపుచు నున్నదెయ్యెడకుఁ జనుదు.

గీ. మేఘభటపంక్తి తమ విచ్చు మెఱుఁగుకత్తి
గముల జళిపించుచుండె నక్రమముగానె!
వాయు రాక్షసి తన మహాబలత నెఱప
వచ్చుచుండె జౌజవ్వనఁబైకిఁ బైకి.

గీ. కాంతివాడి నిర్వాణోన్ముఖంబులైన
దీపికాజాలకంబట్లు తెలియవచ్చు
తారకలు నాదుదైన్యంపు దశ నెఱింగి
దుఃఖపడుచుండినట్టులఁ దోఁచుచుండె.

గీ. దేవ! యేకాకినయి చిక్కితినిఁ బ్రపంచ
కాననమునందుఁ గటిక చీఁకట్లు గ్రమ్మె
నాకుఁ జేయిచ్చి నీ విమానంబు పైకిఁ
దీసికొని పోయి నాభీతిఁ దీర్పవోయి!

———

# అపచారము.

గీ. పెద్ద తప్పిదమొండు గావించినట్లు
నీమొగమ్ముఁజూడ లజ్జించు నామనంబు
ఎదురుపడిన మొగంబెత్తి యెదియుఁగూడ
మాటలాడంగ వెఱతు టాటోటుగాదు.

గీ. నీకు ఋణపడియున్నట్లు నిన్నుఁజూడఁ
గంపముదయించుఁ జెమ్మటల్ గ్రమ్ముకొనును
శ్రోత్రియుంగన్న మాలని చొప్పుదోఁప
దవ్వుగాఁ దప్పుకొనుచు నే దాఁటిపోదు.

గీ. క్రూరమైన పిశాచంపు గుంపులట్లు
కాళశాత్రులయామ సంఘాతమట్లు
మున్నొనర్చినపాపముల్ ముఖసహస్ర
ములను వివరించుకొనినన్ను ముట్టడింపఁ
బ్రక్కనేయున్న నీప్రాపు ధిక్కరించి
ముచ్చుపోలుపున భూబిలంబుననుగాని
శూన్యమునఁగాని దాఁగుకోఁజొఱఁదలంతుఁ
బుణ్యమూర్తి! నాయపచారములు క్షమింపు.

---

# బాల్యస్మృతి.

గీ. బాల్యమున మనమొక్క యుయ్యాలమంచ
మందుఁ దూఁగుచు నెదొ ! ముచ్చటించుకొనుచు
నొకరొకరిచెవ్వి గుసగుసలాడుకొనుచుఁ
గలికి ముసిముసి నగవులు నవ్వుకొనుచు
బురదనేలలఁ జిందులు ద్రొక్కుకొనుచు
దాఁగిమూఁతలనాడుచుఁ దిరిగినాము;
చెఱువులందీఁదినాము; చెట్లెక్కినాము;
వెన్నెలబయళ్ళకు సికారు వెడలినాము;
తేంట్లపాటలు శ్రుతిసేసి పాడినాము;
కృత్రిమంబుగఁ గలహంబు లాడినాము;
మృదుళ సాంత్వనములను జేసికొనినాము;
గండుగోయిల కోకోరవంబులకును
దోహదంబులు మిక్కిలి సలిపినాము;
"నీవె నేను నేనే నీవు" నానభేద
మడరవర్తిలినారము; నన్నుమఱచి
నావు కాఁబోలు; నేనిన్ను మఱవ లేదు;
మనదు బాల్యకేళులు సమస్తమును నాదు
కనులయెదుటను గట్టినట్లున్నవయ్య !

మఱల నీతోడఁగూడి యాయావిధముల
నాకు విహరింప మనసుగానుండె సఖుఁడ !
నాదుకన్నులు చూడఁగరాని వెలుఁగు
లందుఁ గూర్చుంటి నెల్లవీక్షింతు నిన్ను !

---

# సందర్శనము.

గీ. అల్ల శంపాలతా ప్రగ్రహములు గలుగు
వారివాహాశ్వములఁ గట్టఁబడిన పుష్ప
రథముపై నెక్కి యూరేఁగు రమ్యమూర్తి
దివ్యతేజస్విఁ గనుఁగొంటిఁ దృప్తిఁగంటి.

గీ. అలనదీ సైకతములకు నరిగి యచటఁ
దనదు దివ్యకటాక్ష శీతల తరంగ
ములను బ్రకటించు నా కృపా పూర్ణహృదయుఁ
గనులపండువుగా నేఁడు గాంచినాఁడ.

గీ. కోకిలాధ్వని శ్రుతిసేసికొని వసంత
రూపగీతంబుఁ బాడి భూరుహములెల్లఁ
జిగురు వెట్టంగఁ జేయుచుఁ జిత్తములను
పరవశముఁ జేయు గాయక వరునిఁగంటి.

---

# కృతఘ్నత.

మ. నినుదర్శింపనె నీయొసంగు కనులన్ నీయన్యముం జూచుచుం
టిని; నిన్నే నిలుపంగ నిచ్చిన మదిన్ నీభిన్నమున్ నిల్పుచుం
టిని; నీపూజకె యిడ్డ హస్తయుగమున్ సిలాఁతిఁ బూజింపఁగా
వినియోగించి కృతఘ్నతన్ నెఱపితిన్ విశ్వేశ! మన్నింపుమా!

మ. నినుఁ బాడంగనె నాకు నేర్పితివి నీవౌన్ దానిపై నొక్క కీ
ర్తనమేనిన్ నినుఁ గూర్చి పాడియెఱుఁగన్ శ్రావ్యంబుగా నీకు; దే
వ! నితాంతంబు దురాశమైనటు నిటున్ బర్వెత్తుదున్ నీదుద
ర్శనమున్ రోసి; కృతఘ్నతన్ నెఱపితిన్ సర్వేశ! మన్నింపుమా!

గీ. నీవొసఁగు జీతబత్తెముల్ నెమ్మిఁ గొనుచు
నీదు కొలువును నొకనాఁడు నేనొనర్ప
జీతమును నాకు నింక హెచ్చింపవనుచు
సిగ్గు దిగఁ ద్రావి నిన్ను దూషింతు నెపుడు.

గీ. నీ సమక్షంబునకు రాఁగ నేను వెఱతు
ప్రభువు డాయంగఁ గొంకు నేరస్థుఁడట్లు
నీ పరోక్షంబునందును నిలువ వెఱతు
మనవి నిను వినా విను దయామతి యెవండు?

---

# మృత్యువు.

గీ. అర్ధరాత్రమైనది, కాలుఁడంధకార
రూప మవగుంఠనముఁ గప్పెరోదసిపయి;
నదిగొ! గణగణ మ్రోగుచున్నదియ గంట
నాకుఁ బహరాకు వేళయైనయదియపుడె.
ప్రభువుశాసనమది దాటరానిదగుట
నేనుబోవక తప్పదు; కాని నన్ను
వెళ్ళవలదని యడ్డంకి పెట్టితలలు
మోఁదుకొని యేడ్చుచును బిక్క మొగమువైచి
చూచు చున్నట్టి మావారిఁ జూచినపుడు
జాలిఁగలిసిన జిలునవ్వు జాలువాఱు.

---

# దైవము.

మ. ధనమున్ బుత్త్రులన్ గళత్రమును నేతండిచ్చెనాతండె కై
కొనవాంఛింపఁ, గృతఘ్నుఁడైయిడకబల్ ఘోరంబుగాఁదిట్టుటల్
చనునే? మంచికిమంచిలేదఁటభువిన్; సత్యంబయామాట; కై
కొనునప్డున్నయుదారతన్ విడుచుచోఁ గూడన్ వహింపందగున్.

ఉ. నీవయి తెల్పఁజాలవని నీపయినిండిన కూర్మిచేత నే
దైవము తెల్పఁబూనుకొనఁ జావక సంసృతి బంధనంబు వా
పోవుట కృత్యమే? పరమపూరుషుఁడేని ననుగ్రహించునో!
తావచియించెఁగాదె? జన! తత్సకలంబుహరింతునంచునున్.

ఉ. ఆపదగల్గెనంచు హృదయంబునఁ దల్లడిలంగఁబోకుమే
కోపములేద యీశ్వరునకున్ నినుఁగూఱిచి; నీ మనోధృతిన్
నీ పురుషార్థసంగతియు నిక్కముగాఁ దెలియంగఁజేసి లో
కోపకృతిన్ ఘటించువిధియొక్కయుదాహరణంబుగానినున్-

గీ. మంగళంబులు సమకూర్పుమా! యటంచు
దినదినము దేవదేవుఁ బ్రార్థింపుమయ్య!
అతఁడు చేకూర్చునదియెల్ల నాత్మహితమె
యనుచుఁ గొలువుమా! తప్పక యతని విడక.

---

# వేదన.

గీ. ఇట్టిదట్టిదియనుచు నూహింపరాక
హృదయమొక వేదనంబడి సదమదమగు
నెద్దియో చెప్పఁగాఁబోవు; నేదొ! కొంతు
కడ్డపడినట్టులుండి ప్రయాసపడును.

గీ. స్మృతికివచ్చిన యటులుండి స్మృతికిరావు
నాదుమునుపటివైన జన్మములకథలు
కానఁబడినట్టులుండియుఁ గానరాదు
నాభవిష్యచ్చరిత్ర మంతయునదేమొ?

గీ. అలికిడైనట్టులుండు నెవ్వాతఁడులేఁడు;
గుసగుసలుదోఁచు నదియేమొ? గోచరింప;
దెదియొ! పయిఁబ్రాఁకినట్లుండు నెదియుఁగానఁ
బడదు; మెయిదూఁకినట్లెదొ! చిడిముడియగు.

గీ. జరుగుచున్నది హృదయగహ్వరమునందు
ఘోరయుద్ధమదేలొ? వ్యాకులవ్రజాల
నపుడపుడునాదుగదియొద్ద కరుగుదెంచి
నన్నుఁగని కన్నుఁగొలుకుల నవ్వుదీవు.

---

# వరము.

గీ. తినుటకున్నట్టి దానితోఁ దృప్తిఁబొంది
పరుల భాగ్యంబుల కసూయపడుటమాని
ఆస నందని పండ్లకు నఱ్ఱుసాచి
కలిమి మొదటికి మొప్పంబు కలుగకుండ
లేనిపోని తంటాల జోలికినిఁబోక
కలిమొ! గంజియొ! త్రాగి సౌఖ్యముగనింటఁ
గడుపులోఁజల్ల బొత్తుగాఁ గదలకుండ
శక్తి కొలఁదిగఁ బరులకు సాయపడుచుఁ
దగనవశ్యంబులగు పదార్థములుమాత్ర
తనకుఁ దానయి గడియించు కొనఁగఁజాలి
సరసవిద్యాలతాంగితో సౌఖ్యపడుచుఁ
బెలుచ హరి కీర్తనంబుఁ గావించుకొనుచుఁ
బరులచేఁ జూడఁబడకయు నెఱుఁగఁబడక
పంకమునయందుఁ గాల్జాఱి పడుట లేక
నిర్విచారంబుగాఁ బొద్దునెట్టుకొనుచు
బ్రదుకఁగానాకునో దేవ! వరము నిమ్మ.

---

# తృ ణ క ణ ము లు.

౧

గీ. మంద మలయానిలంబులు మలయుచుండ
నిన్నమాపట నా ప్రశాంతిమయగగన
తటినియందున శశికళా తరణినెక్కి
చెలిమికాండ్రతో గానంబు సేసికొనుచుఁ
బోయి యున్నది నీవు కావోయి? సఖుఁడ!
అదిగో! నిన్నటిరాత్రి మేఘాశ్వమెక్కి
తారకాగణోద్యానరథ్యలను స్వారి
చేయుచున్నది నీవు కావోయి? సఖుఁడ!
మొన్న పున్నమనిసయందుఁ బొడుపుఁగొండ
శిఖరమునఁ గూరుచుండి రసికత వెలయఁ
బశ్చిమాశాంగనామణిపైని మల్లె
చెండు విసరినదీవెకా చెలిమికాఁడ!
పాలఁజూచితి గనుచూపు మేరనుండి.

౨

గీ. ఈ మహాకాంతి యెచ్చటి? దెవరు లేర?
ఆకసంబునఁ జంద్రుఁడా! అస్తమించె
దారకాబృందమా? వారిదముల డాఁగె
ఈ మహాకాంతి యెచ్చటి? దెంత మధుర

మెంత హృదయంగమంబయి యింపునింపుఁ?
దావకీనతనూవల్లి కావిలాస
పూరమా? కాక త్వత్కృపాక్షీరసింధు
ధవళభంగములా? లేక తావకమగు
సరస రమణీయ మందహాసంబొ? దేవ!

౩

గీ. నాదు దీపంబు తైలశూన్యమనికాని
కాలపరిమితి యింతని కాని తెలియ
దాని నిర్యాణకాలంబు దగ్గఱించి
నట్టులున్నది మినుమిన్కు లాడుచుండె.
నావిధులనొక్కఁడేని నొనర్ప లేదు
ప్రభువు కేమని ప్రత్యుత్తరంబు నిత్తు?

౪

గీ. శాంతిపాలిత మానంద కాంతిదీప్త
మయిన మామకహృదయా సౌథాంతరమున
రేయుఁబవలును సంధ్యలుఁ బ్రీతిగదుర
సఖుఁడ! నీతో వసింప నిష్టంబుగలదు;

గీ. త్వద్విమానంబు నాదు సౌధంబుపైకిఁ
బట్టుమోయియా! సమర్పింతు స్వాగతంబు

నచలితానంద మయ హృదయంబుతోడ
బాష్పజలపూర్ణ నేత్ర కుంభములతోడ.

౫

గీ. ఓ అయస్కాంతమా! సువర్ణోత్కరంబు
మణిసముచ్చయముండిన గణనఁగొనవు;
నాయయఃఖండమందు ననశ్వరమగు
ప్రేమ నీకేల్లుకలిగె? వర్ణింపఁజాల.

గీ. ఓమహారాజ! రజతసముజ్జ్వలములుఁ
గాంచనములగు పాత్రముల్ కలిగియున్న
నాదుమట్టిగలంతియ మీఁదనీకు
నేల యవ్యాజకృపగల్గె? యెఱుఁగఁజాల.

గీ. ఓయి! నైణిక వాంశిక గాయకాళి
చూపి తమతమ సంగీత నైపుణంబు
నిన్ను నానందపఱచుచు నున్న నేల
నాదు కూనరాగమువిను నాదరంబు?

౬

గీ. అలలు కాలసర్పము పడగల విధాతిఁ
బైకి నాల్కలు గోరియుచు వచ్చుచుండె;
యమునిసైనికసందోహమనఁ దిమింగి
లాది జంతువుల్ తట్టుముట్టాడుచుండె;

కుటిలమృత్యుదేవత కంఠకుహారములన
నెసఁగు నావర్తములు వివరించియుండె;
జవ్వనను జలివేయు క్షపాయి యొకఁడు
వాఁడకత్తితోఁ బైనుండి వచ్చుచుండె
ఓయి యమృతశకుంతమా! యొక్కమారు
వెలయు నపరంజి రెక్కలు విప్పివచ్చి
పైనివ్రాలి నీకాళులలోన నన్ను
గుచ్చికొనిపోయి కాపాడఁ గోరినాఁడ.

౭

గీ. జగతిఁగల సర్వజంగమ స్థావరములు
నాదుజన్మలమూర్తులై నాకుఁదోఁచుఁ
దారకలు దేవ! నీకృపాధార సిద్ధిఁ
గొన్నసిద్ధులమూర్తులై చెన్ను మెఱయు.

౮

గీ. కడలికరుడులగమినాదు కలుషములకుఁ
బ్రతికృతులటంచుఫే నాక్షరముల వ్రాసి
నాకుఁ జూపుచునున్నా; వనేకగతుల
దేవ! తత్ప్రతీకార మర్థింతు నిన్నె.

౯

గీ. నిన్ను సాక్షాత్తుగాఁ గాంచనేని నట్టి
మాదృశులను ననుగ్రహింపంగఁ దలఁచి

పుడమిపై నీ బుణ్యక్షేత్రముల మిషమునఁ
దావక కటాక్షముల నిల్పినావె! దేవ!

౧౦

గీ. మూఢపశుజన్మఁ దప్పించి పూర్ణ కృపను
దేవ! నరజన్మమును బ్రసాదించినావు;
కాని తొలిజన్మధర్మ మేకారణమున
న్యాయ్యపరివర్తనంబుఁ జేయవు? మహాత్మ!

౧౧

గీ. నిను జపించుచుఁ గూర్చుండ నిశ్చలముగ
నన్యసంకల్పపక్షిచయంబు వచ్చి
వ్రాలు నాదగు చిత్తంబుపైని; విసరి
చూడ్కి యొడిసెలగమి వెలార్చుమ మహాత్మ!

౧౨

గీ. కడఁగి యెప్పటికప్పుడే కడిగి తుడుచు
చున్నఁ బైనుండి రాలుచునుండె దుమ్ము
నామనోదర్పణంబున; నాథ! కప్పు
మా! భవత్కృపాచ్ఛాదనాంబరము దాన.

౧౩

గీ. పుడమి నాజీవితంబొక మురికికాల్వఁ
జేసి యెల్లకల్మషరాశి చేరనిందుఁ

బెక్కుతూములు నిర్మించి పెట్టితేల!
పంటకాల్వగ దానిమార్పఁదగు దేవ?

౧౪

గీ. నీమహాశక్తి శైవాలినీర్ఝరంబు
కొండపయినుండవలె జీవకోటిపైని
బడుచు సర్వతోముఖముగాఁ బాఱుచుండి
క్షితిని గల్యాణవంతంబుఁ జేయుదేవ!

౧౫

గీ. కేలులేదు; గ్రహింతువు; కాలులేదు;
పఱతు; కన్నులేదు కనుదు; మఱియువీను
లేదు వినుదు; నీచరితముల్ దేవ! భువిని
నశ్రుతచరంబులును నద్భుతావహములు.

౧౬

గీ. నిను సమీపింపఁగావలెనని యనంత
కాలములనుండి యత్నింతు గాఢముగను
దేవ! కకుబంతరేఖమాదిరిగ దవ్వ
దవ్వులకుఁ బాఱ నిన్నెట్లు దగ్గఱింతు?

౧౭

గీ. నాదువదన ధారాంబు యంత్రింబునుండి
విధవిరామంబు లేకెల్ల వేళలందు

గాన పూరంబుఁ బాటించి దానిచేత
నిత్యమభిషేక మొనరింతు నీకు దేవ!

౧౮

గీ. కన్ను దెలిదమ్ములును మనఃకైరవంబు
నడుగుఁదామర దోయియు హస్తకోక
నదము లివ్వన్ని గలిపి దండగను గ్రుచ్చి
తండ్రి! నీకు సమర్పింపఁ దలఁచినాఁడ.

౧౯

గీ. నాదు పిల్లన గ్రోవిని నూఁది దేవ!
తావకాలయమంటప స్తంభములను
జిగురువెట్టంగ నొనరించి శీతలమగు
కాయమానంబు నిర్మింతు హాయినింతు

౨౦

గీ. ధాటి నానైపుణముఁ బాఱు త్వత్కృపాత
రంగిణికి దేవ! నాదు ప్రారబ్ధకర్మ
పర్వతంబయి యాతంక పఱుప నకట!
తప్పకొని ప్రక్కవాటుగా దాఁటిపోయె.

౨౧

గీ. తావకపదాంబురుహ సన్నిధానమందు
మోఁకఱిలియుంటేఁ గేల్దోయి మోడ్చి దేవ!

త్వత్కటాక్ష పుష్పాక్షతల్ దయదలిర్పఁ
జల్లి దీవింతువన్న యాశనువహించి.

౨౨

గీ. ప్రభుఁడవా? లోకములకు సేవకుఁడవా? త్వ
దీయ సత్యపథంబును దెలియకుంటిఁ;
బ్రభుఁడవేనిఁ ద్రిప్పుము సుమార్గమునకు మము;
సేవకుఁడవేని మాయాజ్ఞ సేయుమయ్య!

౨౩

గీ. ఒక్కపువ్వు నొసంగినఁ బెక్కుఫలము
లొక్కతృణముసమర్పింపఁ బెక్కుకోట్ల
ధనములిత్తువు; నీ యంగడిని లభించు
రాగిపైసకు రతనాల రాసిదేవ!

౨౪

గీ. మామక కటాక్ష భూషణమాలికలను
లలితముగఁదావకాంగం బలంకరించి
చిత్రపీఠంబుపైని నాసీనుఁజేసి
నిను గుఱించి గీతములు పాడుకొనుదు దేవ!

౨౫

గీ. నాదు జీవితగాథ లెన్నటివి నాఁడె
తెలుపుచుంటి నాగానతంత్రిలతమీఁద

సత్యవశ్యంబులగు ననేకాంశములకు
నోయి! ప్రత్యుత్తరము గోరుచున్నవాఁడ.

౧౬

గీ. ఓసి! పుష్పాంజలీ! నీ యొకొక్క పువ్వు
నాకు నొక్కొక్క దూతయై నాదు హృదయ
వేదనలు సహస్రముఖాల వెల్లడించి
దేవదేవుని కృపను సాధింపఁబొమ్ము!

౧౭

గీ. నిన్నుఁగన నాకు నిపుడున్న కన్నుదోయి
చాలదనియందువా? యట్లు చాలకున్నఁ
జాలినట్టిది కల్పింపఁజాలవే? యే
దో? నెపమువెట్టి తప్పించుదువు మొగంబు.

౧౮

గీ. నను భవత్పరిచారక జనమునందు
నెలమిగడవానిగానైన నిలుపుమమ్మ
నిత్యమును నీదు దివ్యమందిరమునూడ్చి
కొలుచుచుందును నెల్లవేళలను దేవ?

౨౯

సీ. పద్మముల్ గావు నీ పాదముల్ నామనో
భ్రమరంబునకుఁ జంపకములుగాని
వనజారిగాఁడు నీవదనంబు నానేత్రి
కువలయద్వయికిని సవితగాని
సుమవృష్టిగాదు నీచూపుల నుండి నా
పయిరాలునది బాణపటలిగాని
అమృతంబుగాదు నీహాసచంద్రిక నన్నుఁ
గనువేళఁ బెనువిషాకరము గాని

గీ. అభయదముగాదు నీదైన హస్తశాఖ
కరుణమాలి నన్ జళిపించు కత్తిగాని
యిట్టివిపరీత రూపంబు నీవు దాల్పఁ
గటకటా ! దేవ ! నాపాపకర్మమేమొ ?

౩౦

సీ. ఒకసారిబర్హి శాబకములతోఁ గూడి
యందంబుగా లాస్యమాడినట్లు
ఒకతేపఁ జంద్రిచంద్రికల మవ్వంబును
నవ్వంగఁ గలకల నవ్వినట్లు
ఒకమారు మబ్బులందున్న చంద్రికళనా
నడరుచు దోబూచు లాడినట్లు

ఒకసారి మందానిలోదయంబై సట్టి
వేగఁబోక సికారు వెడలినట్లు

గీ. దాఁగిమూఁతలనాడుచు దాఁగినట్లు
చిలుకపలుకులతో నన్నుఁ బిలిచినట్లు
గుసగుసలువల్కుఁ చెవిచెంతఁ గూరుచున్న
యట్లునాసామి నాసఖుండాత్మఁదోఁచు.

## ౩౧

సీ. బాలరంభాస్తంభ జాలసౌభాగ్యంబు
మొత్తంబుగాఁబోఁత పోసినట్లు
కమనీయమల్లికా సుమపరీమళరేఖ
గట్టిగాఁ బెనుగడ్డ కట్టినట్లు
మానితహైయంగ వీనమార్దవభూతి
చెన్నొంద(గాఁబొ)గుసేసినట్లు
సలలితమాకందఫలరస సంపత్తి
పెల్చననాకృతిఁ దాల్చినట్లు

గీ. ముగ్ధమధురంబునున్ జగన్మోహనంబు
శాంతిసంబద్ధమగు భవచ్చారురూప
మకట! నాదగుపాప వీచికలుగప్పి
కానఁబడకుండఁజేసె; నాగతియిఁకేమి?

౩౨

గీ. నిన్ను ముద్దాడుచున్నట్లు నిశ్చయించి
నాకుమాపుని ముఖచుంబనంబు సేతు:
నిన్నుఁ (?) గలిఁగొనునట్లు నిశ్చయించి
నా ప్రియాలింగనంబు నొనర్తు దేవ !

౩౩

గీ. నాయికానాయకప్రీతి నాయకులయుఁ
దొడరి చేటీకిరాత విదూషకులయు
భూమికల నీవొకండవ పూనిపూర్ణ
నాటకముఁ జిత్రమాడు చున్నావు దేవ !

౩౪

గీ. వేయికన్నులతోఁ గని పెట్టుచుంటి
నెపుడు తప్పించుకొనుచుఁ బోయెదవె ! నాదు
వజ్రపుఁగోటనుండియు బయలికనుచు
నెఱుఁగనేత్రోవ వెలికిఁ బోయితివొ? దేవ !

౩౫

మ. గుడికట్టించియమూర్తిమంతుఁడగునీకున్ మూర్తిఁగల్పించియే
ర్పడనో దేవ! పసిండిదువ్వలువలం బైఁగప్పిపూదండలన్
మెడలో వైచి సహస్రనామములతో నిన్నుం బరిశంసించుచుం
గడుబత్తిం గుసుమంబులన్ దళములన్ గావించెదం బూజలన్

౩౬

చ. కడుఁబొగచూరినల్లఁబడి కాంతియడంగిన గాజుగొట్టముం
గడిగియునీటితో విమలకాంతియుతంబుగఁజేసియున్న న
ప్పడెమసిబాఱినల్లఁబడి పోవుచు దివ్వెవెలుంగుఁ దగ్గఁజే
సెడు;నిదిస్నేహదోషమునఁ జేసియొ! యెట్లిఁక గాంతువస్తువున్

౩౭

గీ. ప్రాహ్ణసాయాహ్నవేళలఁ బ్రత్యహంబు
నేస్తులంజూడఁబోయెదు నీవుదారి
మధ్యనున్నది యోప్రభూ! మద్గృహంబు
కాన దయసేయఁగా దవ్వుగాదు నీకు.

౩౮

గీ. తరుల చిగురాకు కదలికల్ డాలఁగాంచి
వాని చల్లని నీడఁ బూఁబాన్పుపయి
శాంతముగ నీవు పండ నిశ్శబ్దముగను
నాకుఁ దెలుపుచునున్న చందమున బ్రమసి
గట్టులను బుట్టలను దాఁటి కాల్వలీఁది
పోయికని యాత్రమునఁ దెల్లఁ బోయినాఁడ.

౩౯

గీ. నీమహాసౌధపుర్ద్వార భూమికడకు
వచ్చి గొంతెత్తి పిలిచితిఁ బలుతడవలు

'ఓ' యనెడుమాట వినఁబడదొక్కటియును
ఉంటివో! లేదో? తెలియరాదింట నీవు.

౪౦

మ. నడిరేయయ్యెఁ బ్రశాంతనిద్రఁగొని యున్నారింటివారెల్ల రి
ప్పుడు; శాంతిం జెనువృక్షమర్మరరవంబుల్ ఝిల్లికారావముల్;
తడవుం జేయకరమ్ము! మిత్రమణి! మత్సౌధాబుపైఁ జేరి హె
చ్చెడుమోదమ్మున నల్పుకొందమిషడక్షీణంబుగామంత్రముల్

౪౧

గీ. వినియు నాజీవిత గ్రంథమును బుధేంద్ర!
దోషముల్ సవరించి తద్గుణాలవంబుఁ
బెంపొనర్చి రసస్ఫూర్తి వెలయఁజేయు
నుంకిత మొనర్తు నీకు నత్యాదరమున.

౪౨

శా. ఆకాశంబదివంచి శీర్షము నమస్యం జేయు; భూదేవి యా
శాకాండంపుఁగరంబులెత్తి మనవింజల్పుక్; గిరిశ్రేణి దం
డాకారంబుగవ్రాలిమ్రొక్కెడు; సముద్రాబ్ధుల్ భవత్ప్రార్థనా
శ్లోకౌఘంబుజగత్ప్రభూ! తగఁబఠించుంబ్రోచ్చకంఠంబులన్

౪౩

సీ. సెలయేఱుబాల! మీసలలితసలిలంబు
భక్తియుక్తంబుగాఁ బాద్యమిందు

లతలార ! మీమృదుళమ్ములైన పుష్పమం
జరులనర్ఘ్యంబు లొసంగుఁడమ్మ !
తరులార ! మీదివ్యతరఫలబృందమా
హారమర్పింపుఁడాప్యాయనముగ
పతగంబులార ! మీస్వాదువాక్కులతోడ
క్షేమవార్తలను బ్రశ్నింపుఁడయ్య !

గీ. ఆజగత్ప్రభుఁ డీ దినంబతిథియగుచు
నా కుటీరంబునకువచ్చు నన్నుఁదరింప
హర్షసమ్మోహచిత్తుండనై తెలియక
ఆతనికి నపచారంబు సేతునేమొ ?

౪౪

ఎచ్చటెచ్చటనో ? దేవ ! యెఱుఁగకుండ
దాఁచియున్నావు నాపదార్థములనెల్లఁ
బెద్దకాలంబునుండియు వెదకి వెదకి
విసుఁగు పుట్టెనుగాని కాన్పింపదొకటి

౪౫

నిదుర మేల్కాంచి మున్నున్న నెలవుఁదప్పి
కలుషభూయిష్ఠము భయానకముజుగుప్సి
తంబునగు నొక్క యంధకూపంబునందుఁ
బడి యునికిఁ గంటి సత్యమో ? స్వప్నమొక్కొ ?

## ౪౬

గగననైల్యంబు, శశికళంకంబు, వార్ధి
లవణ భావంబు, హాలాహలంబు చేఁదు,
నూదుహృదయమాలిన్యంబు నూయదెల్లు ;
మాపు దివ్యౌషధినొసంగుమా ! మహాత్మ !

## ౪౭

శా. ఏతీర్థంబులఁ గ్రుంకులాడితినొ ? మున్నే వేల్పుఁబూజించిసం
ప్రీతుంజేసి వరంబులం గొనితినో ? వేదంబులన్ నాల్గిటిన్
వేతూరుల్ పఠియించినానొ ?నర యోనింజన్మముఁబొందగన్
భూతవ్రాతమునన్ ;శుభేంద్రియగణంబుంబొందిశోభిల్లగన్.

ఉ. ఉత్తరకాలమందిటులె యుత్తమజన్మముఁబొందఁజేయ నే
నత్తెప; మెట్టిహీనమగు జన్మము కల్గునొ ! యింక నాకునం
చుత్తలపాటుతో హృదయమూఱటఁగాంచక కూరుచుండి వె
ఱ్ఱెత్తినరీతి నేడు జనులెల్లరు నర్థముగాక చూడఁగన్.

## ౪౮

నాఁటినది నింబబీజమా నాఁడు; నేఁడు
చూతఫలమును గాంక్షించి చూచుచుంటి
మూర్ఖుఁడనొ ? వెఱ్ఱివాఁడనో ? పోల్పలేను
నా ప్రయత్నంబులకు నాకె నవ్వువచ్చు.

౪౯

సీ. శాద్వలమునకు సాయాహ్నసమయమందు
నేగు దెంతువు నీవని మెప్పటివలెఁ
బోయి కూర్చుండితినిఁ బ్రొద్దు వోవుదాఁక
నీవు రాలేద కారణం బేమొ! సఖుఁడ!

గీ. వేగుబోకల వాహ్యాళి కేగునపుడు
నాదు గదివద్ద కరుదెంచి నన్నుఁ బిలుతు
ననుచు నీకయి వేచియుంటినిఁ జిరంబు
నీవు రాలేద కారణం బేమొ? సఖుఁడ!

గీ. వచ్చి భోజనవేళకుఁ బ్రక్కఁ గూరు
చుండి ముచ్చటలాడుచు నుందువనుచుఁ
గాచుకొనియుంటి నే నొంటిగంట దాఁక
నీవు రాలేద కారణంబేమొ? సఖుఁడ!

౫౦

కం. అతటంబులైన నా జీ
విత గత దుఃఖపరీవాహ వితతుల తత్త
ద్గతులెన్నని వినిపింతును?
నితాంతమును విసుఁగుపుట్ట నీకును దేవా!

